

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక–18

భూవరాహ స్వామి, తిరువిడవిడందై




'పండితరత్న'

డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



భగవద్రామానుజులువారు, శ్రీపెరుంబుదూర్

# విషయ సూచిక

# మందహాసం— ఉచ్ఛహాసం

(శ్రీకార్పంగాడు వేంకటాచార్య స్వామి)

భగవంతునకు మందహాసం, ఉచ్ఛహాసం అనేవి రెండు ఉన్నాయి. కుచేలుడు ద్వారకకు వెళ్ళి శ్రీకృష్ణుని కలిశాడు. శ్రీకృష్ణ భగవానుడు అతనిని స్వాగతం పలికి, అతనికి చక్కగా ఉపచారాలను చేశాడు. భగవంతుడు తాను, రుక్మిణి దేవి శయనించే మంచంలో కుచేలుని కూర్చోబెట్టి, అతని కాళ్ళను పట్టుకొని సంవాహనం చేశాడు. రుక్మిణిదేవి కుచేలునకు విసనకర్రతో విసిరింది. ఆ దివ్యదంపతులు ఇద్దరు కుచేలునకు, వీరిని చూడడం కోసం చాలా దూరం నడచి వచ్చిన శ్రమ తీరేటట్లుగా, ఈ విధంగా ఉపచారం చేయడాన్ని చూస్తున్న రుక్మిణి దేవి చెలికత్తెలు, "బక్క చిక్కి ఉన్న ఈ బ్రాహ్మణుడు ఇంతటి భాగ్యాన్ని పొందడానికి ఎంత పుణ్యం చేశాడు కదా! "అని ఆశ్చర్యపడ్డారు.

"పరమాత్మ అయిన నీవు పాపిష్టివాడును అయిన నా కాళ్ళను తాకి ఈ విధంగా ఉపచారం చేయాలా?" అని అంటూ కుచేలుడు శ్రీకృష్ణుని ప్రశ్నించాడు. ఈ మాటను విని భగవంతుడు మందహాసం చేశాడు. శ్రకృష్ణుని సంబంధం పొందిన కుచేలునకు ఏమి పాపం ఉండే అవకాశం ఉన్నది? భగవంతుని భక్తులకు పాపం ఉంటే, అది అతని గొప్పతనానికి లోపమే కదా అవుతుంది, అప్పుడు భగవంతునకు దీనికి ముందు జరిగిన ఒక సందర్భం గుర్తుకు వచ్చింది.

సంసారి అయిన ఒకడు భగవంతుని దగ్గరకు వచ్చాడు. భగవంతుడు అతనిని చూచి "నీవు పుణ్యం, పాపం రెండిటినీ చేశావు. మొదట నీ పుణ్య ఫలాన్ని అనుభవిస్తావా? లేక, నీ పాపఫలాన్ని అనుభవిస్తావా?" అని ప్రశ్నించాడు. అతడు "నేను ముందుగా నా పుణ్యఫలాన్ని అనుభవించాలని కోరుతున్నాను, నేను చేసే పుణ్యానికి

ఫలంగా నేను నీతో సంబంధం కలిగినవాడనై అయ్యేటట్లుగా నీవు నన్ను అనుగ్రహించాలి" అని భగవంతుని దగ్గర ప్రార్థించాడు. భగవంతుడు కూడా "ఆ విధంగానే కానీ!" అని అతనికి అనుగ్రహం చూపించాడు. కొంతకాలం తరువాత, భగవంతుడు అతనిని చూసి, "నీకు నీ పాపఫలాన్ని అనుభవించే కాలం వచ్చింది" అని అన్నాడు. అప్పుడు అతడు "నిన్ను ఆశ్రయించి, నీ సంబంధం పొందిన తరువాత కూడా నాకు పాపం అని ఒకటి ఉన్నదా? నీ శ్రీపాదసంబంధం పొందిన నాకు పాపంఅనేది ఏమీ ఉండే అవకాశం లేదే!", అని అన్నాడు. "ఇంతవరకు నా దగ్గర ఈ విధంగా ఎవరూ ఈ మాటను చెప్పలేదే!", అని భావించిన భగవంతుడు ఉచ్చహాసం చేశాడు. (పగలబడి నవ్వడానికి ఉచ్చహాసం అని పేరు) ఈ విధంగా భగవంతుడు చేసిన ఉచ్చహాసాన్ని ఉద్దేశించి మనం తప్పక ఆలోచించాలి.



# భగవద్గీత – విశిష్టాద్వైతం

అద్వైతులు, ద్వైతులు, విశిష్టాద్వైతులు– అనే వీరు ముగ్గురు కూడా తమ తమ మతాలకు తగిన ఆధారంగా గ్రహించే ప్రమాణ గ్రంథాలు మూడు. వాటిలో, ఉపనిషత్తులు ఒక ప్రమాణం. బ్రహ్మ సూత్రాలు ఇంకొక ప్రమాణం, శ్రీమద్భగవద్గీత మరి ఒక ప్రమాణం. వీటిలో, ఉపనిషత్తులు అనేవి ఎవరి చేత నిర్మింపబడని, దోషం అనేది ఏ మాత్రం దేని ప్రమాణం. బ్రహ్మసూత్రాలు లక్ష్మీనాథుడైన శ్రీమన్నారాయణుని అవతార విశేషంగా కీర్తింపబడే వ్యాసభగవానుని చేత రచింపబడినవి కనుక, ఉపనిషత్తులలో చెప్పబడిన అర్థాలను భ్రమ ప్రమాదాది దోషాలు ఏమీ లేకుండా విచారించే రీతిలో ఉన్నవి కనుక, చాలా గొప్ప ప్రమాణం. ఇక, గీత అయితే, పూర్వం పలికిన పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని పూర్ణావతారంగా లెక్కింపబడే శ్రీపార్థసారథి లోకం అంతా ఉజ్జీవించాలని భావించి, అనుగ్రహించిన చాలా గొప్పదైన గ్రంథం.

వ్యాసభగవానుడు పరమాత్మ చరిత్రను తెలియజేయాలని ఆరంభించినప్పుడు మహాభారతంలో "నారాయణ కథామిమామ్" అని ఆరంభం చేయడాన్ని గమనించాలి. "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (పాలసముద్రాన్ని నివాసంగా కలిగిన ఈ శ్రీమన్నారాయణుడు ఆదిశేషశయనాన్ని వదిలిపెట్టి మధురానగరానికి వచ్చాడు కదా) అనే శ్లోకం ఈ విషయానికి (శ్రీ పార్థసారథి నారాయణుని పూర్ణావతారం అనే విషయానికి) తగిన సాక్షి అవుతున్నది.

ఈ పరమాత్మ అనుగ్రహించిన ఈ గీతాశాస్త్రం కూడా ఉపనిషత్తులలోని అంతరార్థాన్ని తనలో ఇముడ్చుకొన్నది అనే విషయం దీని గొప్పతనాన్ని తెలియజేస్తున్నది.

ఇక, ఈ గ్రంథంలో విశిష్టాద్వైతం ఏ విధంగా ప్రతిపాదింపబడిందో కొంచెం గమనిద్దాం.

విశిష్టాద్వైతం అనే పదానికి "విశిష్టస్య అద్వైతం విశిష్టాద్వైతమ్" అనే విగ్రహాన్ని చెబుతారు. "విశిష్టస్య— చేతన వస్తువులను అచేతన వస్తువులను శరీరంగా కలిగిన వస్తువు యొక్క అద్వైతం, అంటే, రెండుగా లేకపోవడం" అని అర్థం. భగవంతుని కంటే, చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగిన మరియొక ఏ వస్తువు ఏదీ లేకపోవడం —అనేది దీని అర్థం. దీనిని లోతుగా గమనించి చూస్తే, "యస్య పృథివీ శరీరం, యస్య ఆత్మా శరీరమ్" అని దీనిని ఉపనిషత్తు చెబుతున్నది. ప్రపంచానికి, బ్రహ్మానికి మధ్య ఉండే శరీరాత్మభావం అనే సంబంధం దీనివల్ల చక్కగా ప్రకాశిస్తుంది.

"ఏ వస్తువు నియమింపబడడానికి, ధరింపబడడానికి అతిశయాన్ని కలిగించడానికే తగినదై ఉంటుందో, ఆ వస్తువు శేషి, ఏ వస్తువు నియమిస్తున్నదై, . శరీరం చేసే కార్యంవల్ల ఏర్పడే ప్రయోజనాన్ని పొంది, దానివల్ల అతిశయాన్ని పొంది, ఆనందిస్తున్నదో, ఆ వస్తువు ఆత్మ —అని క్రమంగా శరీరానికి, ఆత్మకు లక్షణం చెప్పబడింది.

జీవుడు— చేతులు, కాళ్లు మొదలైన అవయవాలతో కూడిన పిండాన్ని ప్రేరేపించి, దానిని ధరించి, ఆ పిండం చేసే కార్యాన్ని స్వీకరించి ఆనందిస్తున్నాడు కనుక, ఆ జీవుని ఆత్మ అని, ఆ పిండాన్ని శరీరం అని ఏ విధంగా మనం గమనిస్తున్నామో, ఆ విధంగానే, పరమాత్మ కూడా చేతనా చేతనాలు అనే ప్రపంచాన్ని ప్రేరేపించి, నియమించి ధరించి, ఆ ప్రపంచం చేసే కార్యాన్ని స్వీకరించి ఆనందిస్తున్నాడు కనుక, ఆ పరమాత్మ ఆత్మ అని, ఈ ప్రపంచాన్ని శరీరమని తెలుసుకోవచ్చు కదా.

ఇక్కడ, చేతులు, కాళ్లు మొదలైన అవయవాలతో కూడినది శరీరం— అనేది గ్రహించదగినది కాదు. ఎందుకంటే, పూర్వం తెలిపినట్లుగా ఉపనిషత్తులలో జీవాత్మను శరీరంగా కలిగినవాడు పరమాత్మ అని చెప్పబడినందున, దానికి తగినట్లుగా శరీర లక్షణాన్ని మనం చెప్పుకోవాలి— అనేది స్పష్టం అవుతున్నది కదా. పైన పలికిన శరీర లక్షణం అవయవాలు ఏమీ లేని జీవనకు కూడా ఉన్నందున, ఆ జీవాత్మను పరమాత్మ శరీరంగా కలిగి ఉండడానికి ఏ విధమైన అడ్డు లేదు— అని భావించాలి.

ఈ విధంగా విశిష్టాద్వైతం అనే పదానికి "చేతనాచేతనాలను శరీరంగా కలిగినవాని అద్వైతం— అనేది అర్థం" అని తేలుతున్నది. కనుక విశిష్ట వస్తువునకు, అంటే, చేతనా చేతనాలను శిరీరంగా కలిగిన, వాటితో కూడిన పరమాత్మకు సర్వేశ్వరత్వం చెప్పబడుతున్నది. ఇక్కడ చేతనా చేతనాలు సొత్తు అని, భగవంతుడు స్వామి అని స్పష్టమవుతున్నది.

సొత్తు, సొత్తును కలవాడు— అనే ఈ రెండిటిలో సొత్తును కలవాడు గొప్పవాడు అనే విషయం అందరికీ తెలిసినదే. దీనివల్ల బ్రహ్మకు శరీరంగా చెప్పబడే జీవ సమూహంలో చతుర్ముఖ బ్రహ్మ మొదలైనవారు కూడా అంతర్భవించి ఉన్నారు కనుక, వారి కంటే పరమ పురుషుడు చాలా గొప్పవాడు అనేది తెలుస్తున్నది.

వాస్తవమైన అర్థం ఈ విధంగా ఉండగా, పరమాత్మ "నేనే ప్రపంచం గా అవుతున్నాను" అని అనడం ఏ విధంగా పొసగుతున్నది? అని అంటే, "నేనే ప్రపంచంగా అవుతున్నాను "అనేదానికి "చేతనాచేతనాలను శరీరంగా గ్రహించి నేను ప్రపంచం అవుతున్నాను" అనే తగిన అర్థాన్ని చెప్పుకోవాలి.

ఏ విధంగా అయితే, దేవదత్త శబ్దం కంటికి స్పష్టంగా కనిపించే శరీరాన్ని, ఆ శరీరంలో ఉండే, కంటితో చూడడానికి సాధ్యం కాని ఆత్మను నిర్దేశిస్తున్నదో, ఆ

విధంగానే, ప్రపంచశబ్దం కూడా చేతనాచేతనాలు అనే ప్రపంచాన్ని, ఆ ప్రపంచానికి ఆత్మ అయిన పరమాత్మను కూడా నిర్దేశిస్తుంది— అని మనం తెలుసుకోవాలి.

అంతేకాక, అన్ని శబ్దాలు అపర్యవసాన వృత్తి ద్వారా పరమాత్మను నిర్దేశిస్తాయి— అనేది కూడా యథార్థజ్ఞానం కలిగినవారి అభిప్రాయం. దీనిని కొంచెం వివరించి పలుకుతాను.

పదానికి అర్థాన్ని తెలిపే శక్తి రెండు విధాలుగా ఉంటుంది. పశువు, పక్షి, మానవుడు— అని అంటే, పశువు, పక్షి, మానవ శరీరాలతో కూడిన ఆత్మలను అర్థంగా గ్రహించడం ఒక పద్ధతి. ఇది శబ్దశక్తి వల్ల ఏర్పడుతుంది. ఆ ఆత్మలకు కూడా ఆత్మగా ఉండే పరమాత్మను అర్థంగా గ్రహించడం వేరొక విధమైన శక్తి వల్ల ఏర్పడుతుంది. ఈ రెండు విధాలైన శక్తులలో, మొదటిది పర్యవసాన వృత్తి అని, అముఖ్యవృత్తి అని చెప్పబడుతుంది. ఈ వృత్తి లోకవ్యవహారంలో గోచరించేదే. అయితే, రెండవది అపర్యవసానవృత్తి అని, ముఖ్య వృత్తి అని చెప్పబడుతుంది. ఈ వృత్తి వేదాంతాలలో గోచరిస్తుంది. సంగ్రహంగా చెప్పాలంటే, చేతనాచేతనాలు అనే ప్రపంచాన్ని, అంటే, విశేషణాన్ని నిర్దేశించే పదం పరమాత్మను, అంటే, ముఖ్య విశేష్యవస్తువును నిర్దేశిస్తే తప్ప పర్యవసించకుండా ఉండే శక్తి అపర్యవసానవృత్తి అని చెప్పబడుతుంది.

ఇంకే కాక, "దేవదత్తుడు తెలుసుకుంటున్నాడు" అనే వాక్యాన్ని ఉదాహరణగా ఇక్కడ గ్రహించి, పరిశీలించి చూడడం ఆవశ్యకం. "తెలుసుకోవడం" అనేది దేవదత్త శరీరానికి లేదు. "దేవదత్తుడై ఉండడం "అనేది ఆ శరీరంలో ఉండే ఆత్మకు లేదు. మరి, ఈ వాక్యానికి ఏ విధంగా అర్థాన్ని చెప్పుకోవాలి? అని అంటే, "దేవదత్త శరీరంతో కూడిన ఆత్మ తెలిసికుంటున్నాడు" అనే అర్థాన్ని గ్రహించాలి. ఇందువల్ల దేవదత్త శరీరాన్ని నిర్దేశించే పదం ఆ శరీరం వరకు తెలిపి, అంతటితో ఆగకుండా, ఆత్మ వరకు నిర్దేశిస్తున్నది అనేది చక్కగా తెలుస్తుంది కదా.

ఇదే రీతిలో, గీతలో ఉండే "నేను చంద్రుడను" అనే పరమాత్మ వాక్యాన్ని పరిశీలించి చూడడం ఆవశ్యకం. ఈ వాక్యంలో "నేను" అనేది పుణ్యపాపాలను పోగొట్టేవాడు, పరమాత్మ అయిన భగవంతుని నిర్దేశించే పదం. "చంద్రుడు" అనేది పుణ్యపాపాలకు పరవశుడై, ఒక జీవుడైన చంద్రుని నిర్దేశించే పదం. పరమాత్మ అయి ఉండడం చంద్రునకు లేదు. చంద్రుడై ఉండడం పరమాత్మకు లేదు. మరి, ఈ వాక్యానికి ఏ విధంగా అర్థం చెప్పుకోవాలి? అని అంటే, "చంద్రుడు అనే జీవుని శరీరంగా కలిగి న పరమాత్మను నేను "అనే అర్థాన్ని గ్రహించాలి. దీనివల్ల ఈ వాక్యంలో ఉండే చంద్రుడు అనే పదం చంద్రశరీరాన్ని, ఆ శరీరంలో ఉండే జీవుని తెలిపి, అంతమాత్రంతో నిలువకుండా, ఆ జీవునకు ఆత్మ అయిన పరమాత్మ వరకుకూడా నిర్దేశిస్తున్నది—అనేది చక్కగా తెలుస్తున్నది కదా.

ఈ అభిప్రాయాన్ని మనస్సులో పెట్టుకునే "తత్త్వమసి" (నీవు ఆ బ్రహ్మవై ఉన్నావు) అని ఆచార్యుడు శిష్యుని ఉద్దేశించి ఉపదేశం చేసినట్లుగా మనం తెలుసుకోవాలి. ఇంతవరకు తెలిపిన దానినిబట్టి, విశిష్టాద్వైతశబ్దార్థాన్ని, ప్రపంచం, పరమాత్మ, వీటి మధ్య ఉండే శరీరాత్మ భావం అనే సంబంధాన్ని, శరీరాన్ని నిర్దేశించే పదం ఆత్మ వరకు వెళుతుంది అనే క్రమంలో, ఆ పరమాత్మనే ముఖ్యంగా నిర్దేశిస్తుంది రీతిని ఒక విధంగా తెలిసికొన్నాము. ఇక, విశిష్టాద్వైతానికే తగిన ఈ అర్థాలు గీతలో చెప్పబడిన క్రమాన్ని తెలుసుకొందాం.

**"భూమిరాపోఽ నలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ, అహంకార ఇతీయం మే**
**భిన్నా ప్రకృతి రష్టధా, ఆపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,**
**జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్,**
**ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ,**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా,**

**మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ!,**

**మయి సర్వ మిద ప్రోతం సూత్రే మణిగణా ఇవ"**

ఈ శ్లోకాలు ఏడవ అధ్యాయంలో ఉండే శ్లోకాలు. పరమాత్మ భక్తిని ఉపదేశం చేసేవాడై, చాలా చాలా ఉన్నతమైనవానిని చాలా తక్కువవాడు ప్రీతి పూర్వకంగా చేసే చింతనయే భక్తి అని చెప్పబడుతున్నందున, "చాలా గొప్పవాడను నేను" అనే విషయాన్ని, తరువాత, తనను ప్రీతితో చింతించడమే భక్తి అనే విషయాన్ని అర్జునునకు తెలియజేయాలని శ్రీకృష్ణ భగవానుడు అభిప్రాయపడి, ఈ శ్లోకాలలో తన గొప్పదనాలను వ్యక్తం చేశాడు. వీటి భావాన్ని ఈ క్రింది విధంగా మన గ్రహించవచ్చు.

పరమ పురుషుడు తాను స్వయంగా చేసే సృష్టి సమష్టిసృష్ఠి అని, బ్రహ్మ మూలంగా చేసే వ్యష్టిసృష్టి అని చెప్పబడుతుంది. ఈ వ్యష్టిసృష్టిలో, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే భూతాలు, మనస్సు మొదలైన ఇంద్రియాలు, మహత్తత్వం, అహంకారతత్వం అనే ఈ ఎనిమిది విధాలుగా ఉండే తత్వాలు కారణాలు అవుతున్నాయి ఈ తత్వాలు పరమాత్మ అయిన నాకు అవర శరీరాలు. ఈ అచేతనాలు చేతనులకు చాలా ఆవశ్యకాలై ఉన్నాయి. ఈ చేతనులచేత ఇవి ధరింపబడుతున్నాయి. ఈ చేతనులు పరమాత్మ అయిన నాకు ఉన్నతమైన శరీరం అవుతున్నారు. చేతనాచేతన వస్తువులు అనే ఈ ప్రపంచానికి నేను ఒక్కడనే శేషి. నేనే ఈ లోకసృష్టి, లయం అనే వీటికి కారణం. ఏ విధంగా, పైన తెలిపిన విధంగా నేనే శేషిగాను, కారణంగానూ ఉండడంలో చాలా చాలా గొప్పదనాన్ని కలిగినవాడనో, ఆ విధంగానే, గుణాలకు సముద్రంగా ఉండడంచేతకూడా చాలా గొప్పవాడను. నాకంటే గొప్పవాడు ఎవరూ లేరు. ఈ చేతనాచేతనాలు అనే ప్రపంచం నాకు శరీరం. దారంలో గుచ్చబడిన రత్నాలవలె ఆత్మలు అయిన నన్నాశ్రయించుకొని ఉన్నవి— అని ఈ శ్లోకాల అర్థం.

పైన ప్రస్తావింపబడిన శ్లోకాలలో పరమాత్మ చేతనాచేతన వస్తువులను ప్రకృతి శబ్దాన్ని ప్రయోగించి నిర్దేశించడం గమనించదగినది. ప్రకృతిశబ్దం స్వభావం

అనే అర్థాన్ని ఇస్తుంది. చేతనాచేతన వస్తువులు పరమాత్మకు శరీరం. ఆ విధంగా ఉన్నందువల్ల, విశేషణ వస్తువు అయిన స్వభావంగా ఉన్నందుచేత, ప్రకృతిశబ్దం శరీరం అనే అర్థాన్ని నిర్దేశిస్తున్నదని మన పూర్వాచార్యులు అనుగ్రహించారు.

అంతేకాక, "మయి సర్వ మిద ప్రోతం సూత్రే మణిగణా ఇవ" అనే వాక్యం ప్రపంచానికి, పరమాత్మకు మధ్య ఉండే శరీరాత్మ భావం అనే సంబంధాన్ని దృఢంగా పలుకుతున్నది అనేది ఇక్కడ గ్రహించవలసిన విషయం. "ఇదం సర్వం" అనే ప్రయోగం ప్రపంచాన్ని, అంటే, కార్యదశలో, కారణ దశలో ఉండే చేతనాచేతన వస్తువులను అన్నిటిని నిర్దేశిస్తుంది. ""సూత్రే మణి గణా ఇవ" అనే ఉదాహరణను జాగ్రత్తగా, నిశితంగా గమనించి చూస్తే, పరమాత్మ ఒక్కడే చేతనాచేతన వస్తువులను అన్నిటినీ ధరించేవాడు, వాటిలో అంతటా కలసి వ్యాపించి ఉండేవాడు, తనను ఆశ్రయించుకుని ఉండే అన్ని చేతనాచేతన వస్తువుల సహాయం కొంచెం కూడా లేకుండా ఉండేవాడు— అనే విషయాలు చక్కగా స్పష్టపడుతున్నవి కదా. దారం ఒక్కటే అన్ని రత్నాలను ధరిస్తున్నది. రత్నాలు అన్నిటిలోనూ లోపల అంతర్గతంగా మరుగుపడి ఉండి, తనను ఆశ్రయించుకుని ఉండే రత్నాల సహాయం ఏ విధంగాను లేకుండా నిలచి ఉన్నది— అనే ఈ విషయాలు ఉదాహరణలో కూడా మనకు చక్కగా స్పష్టపడుతున్నవి కదా.

పైన ప్రస్తావించిన శ్లోకాలను, వాటి వల్ల బోధపడే అర్థాలను మనం నిశితంగా గమనించి చూస్తే, "పరమాత్మ కార్యదశలోనూ, కారణదశలోనూ ఉండే అన్ని చేతనాచేతన వస్తువులను శరీరంగా కలిగి ఉన్నాడు. అతడు నారాయణుని పూర్ణావతారంగా కీర్తింపబడే శ్రీపార్థ సారథి. అతని కంటే మించినవాడు ఎవడు లేడు" అనే విషయాలు చక్కగా ప్రకాశిస్తున్నాయి కదా.

ఇక, పదవ అధ్యాయంలో వచ్చే ఈ భాగాన్ని కూడా తప్పకుండా గమనించాలి. "ఆదిత్యానా మహం విష్ణుః" అనే శ్లోకం నుండి ఆరంభించి, "యచ్చాపి

సర్వభూతానాం బీజం తదహ మర్జున!" అనే సూక్తి వరకు ఉండే భాగంలో, 12 మంది ఆదిత్యులలో విష్ణువు అనే ఆదిత్యుడు గొప్పవాడు, అతడు నేనే. నక్షత్రాలకు అధిపతి అయిన చంద్రుడను నేనే" అని ఈ విధంగా తన విభూతులను అనుగ్రహించాడు. విభూతులు అంటే నియమింపబడే వస్తువులు. ఈ విధంగా పరమాత్మ అనుగ్రహించడానికి గల యథార్థమైన భావాన్ని మన పూర్వాచార్యులు తెలిపిన రీతిని ఇక గమనిద్దాం.

"అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయః స్థితః" అనే శ్లోకం, "న తదస్తి వినా యత్ స్యాత్ యయా భూతం చరాచరమ్" అనే శ్లోకం కూడా పైన తెలిపిన భాగానికి క్రమంగా ముందు, శ్లోకం తర్వాత ఉండే శ్లోకాలుగా ఉన్నాయి. ఈ విధంగా ఉండే ముందు వెనుకలలోని శ్లోకాల భావాన్ని తెలిసికొని, తరువాత "ఆదిత్యానామ్" అని ఆరంభం అవుతున్న శ్లోకాల అర్థాలను తెలుసుకోవడం ఆవశ్యకం. ఈ విధంగా తెలియడమే క్రమం కూడా అవుతుంది.

"అహమాత్మా గుడాకేశ!" అనే మొదటి శ్లోకం "అన్ని వస్తువులకు పరమాత్మ అయిన నేను ఆత్మ" అనే అర్థాన్ని కలిగినది. ఈ అర్థాన్ని గమనించి చూసినట్లయితే, అన్ని వస్తువులకు పరమాత్మకు శరీరం— అనే విషయం చెప్పకుండానే అందరికీ తెలుస్తుంది. దీనివల్ల అన్ని వస్తువులు పరమాత్మకు శరీరం అనే విషయాన్ని తెలుసుకున్నాం. ఇంతే కాక, ఈ వ్యాసంలో మనం చూసిన విధంగా, "శరీరాన్ని తెలియజేసే పదం ఆత్మ వరకు వెళుతుంది" అనే క్రమాన్ని తెలియజేయడం కోసమే భగవానుడు ఈ విధంగా అన్నాడు— అనే సారమైన అర్థంకూడా ఇక్కడ తెలియదగినది.

ఇక, "న తదస్తి వినా యత్ స్యాత్" అనే శ్లోకాన్ని గమనించి చూసినట్లయితే" ఆత్మను విడచి వేరుగా ఉండే శరీరవస్తువు అయిన ప్రపంచం ఏదీ లేదు" అనేది పైన ప్రస్తావించిన శ్లోకంలోని భావం. మొదట "అహమాత్మా"అని తనను

ఆత్మగా నిర్దేశించినందువల్ల, చివరిలోకూడా ఈ విధంగానే భావాన్ని గ్రహించడం తగినది అవుతుంది కదా. దీనివల్ల కూడా, అన్ని వస్తువులకు పరమాత్మ శరీరం— అనే విషయాన్ని తెలియవచ్చు. ఇక్కడ కూడా, శరీరాన్ని నిర్దేశించే పదం ఆత్మ వరకు కొనసాగుతుంది— అనే క్రమాన్ని చూపడం కోసమే శ్రీకృష్ణుడు ఈ విధంగా పలికాడు— అనే సారమైన అర్థం గ్రహించదగినది.

ఇక, "ఆదిత్యానా మహం విష్ణుః" అని ఆరంభించి పలికే భాగంలో "12 మంది ఆదిత్యులలో విష్ణువు అనే ఆదిత్యుడు గొప్పవాడు, అతడు నాచే నియమింపబడే వస్తువు. అతనిలో అంతరాత్మగా ఉండే పరమాత్మ నేను ఒక్కడనే "అనే పరమాత్మ తన విభూతులను ఉద్దేశించి పలికాడు. దీనిని చూసినప్పుడు, "నేనే ప్రపంచంగా అవుతున్నాను" అని పరమాత్మ పల్కడంలోని యథార్థాన్ని ఈ వ్యాసంలో ఇంతకుముందు పలికినట్లుగా గమనించవచ్చు కదా.

ఇంతే కాక, ఈ విషయం 11వ అధ్యాయంలో ఉన్నది, తరువాత చెప్పబడేది అయిన శ్లోకాన్ని మనం జాగ్రత్తగా గమనించి చూస్తే స్పష్టమవుతుంది. ఆ శ్లోకం ఏమంటే,

"అనంత వీర్యామిత విక్రమ స్త్వం,

సర్వం సమాప్నోషి తతో ౽ సి సర్వః" అనేదే. ఇక్కడ, "సర్వం సమాప్నోషి తతో౽ సి సర్వః" అనే వాక్యం తప్పక జాగ్రత్తగా గమనించి చూడవలసిన ప్రయోగం. ఈ వాక్యం "పరమ పురుషుడవు అయిన నీవే చేతనాచేతన వస్తువులలో, దేనిని విడవకుండా, అన్నింటిలోనూ నిండుగా వ్యాపించి ఉన్నావు కనుక, ఆ చేతనాచేతన వస్తువులను విశేషణ వస్తువులుగా కలిగి ఉన్నందు చేత వాటిని తెలియజేసే సర్వశబ్దంచేత నిర్దేశింపబడుతున్నావు" అనే అర్థాన్ని కలిగినది.

ఇక్కడ, పరమాత్మ ప్రపంచాన్ని సృష్టించడం, ఆ విధంగా సృష్టింపబడిన వస్తువులలో ఒక్కొక్కటిలోనూ ప్రవేశించడం, వ్యాపించడం, ధరించడం, నియమించడం, ఆయా వస్తువులు చేసే పనులను స్వీకరించి, వాటి ఫలాలను పొంది ఆనందించడం మొదలైన వైలక్షణ్యాలను కలిగినవాడు కనుక, ఆ వస్తువులను నిర్దేశించే పదాలకు ముఖ్యార్థంగా ఉండేవాడు అనే ఉపనిషత్తులలోని రహస్యం తెలియదగినది.

పైన తెలిపిన విధంగా సృష్టింపబడిన వస్తువులలో ప్రవేశించి, వ్యాపించి ఉండడం మొదలైన కార్యాలు ఒకదానిని విడచి వేరొకటి ఉండకుండా, కలిసే ఆ పరమాత్మలో ఉండేవి. కనుక, ఈ కార్యాలు ఒకచోట, ఏదో ఒకటి మాత్రం చెప్పబడినప్పటికీ, మిగిలిన కార్యాలు కూడా ఒక విధంగా చెప్పబడినట్లే అవుతాయి.

ఈ అభిప్రాయాలను మనసులో పెట్టుకుని "సర్వం సమాప్నోషి తతో ౽ సి సర్వః" అనే వాక్యాన్ని జాగ్రత్తగా గమనించి చూస్తే ఈ వాక్యంలో పరమాత్మ ఒక్కొక్క వస్తువులోనూ నిండుగా వ్యాపించి ఉండడం మాత్రం గమనించినా, మిగిలిన స్వభావాలను, అంటే, ధరించడం, నియమించడం మొదలైన కార్యాలను దర్శించినట్లుగానే చెప్పవచ్చు కదా. ఇందుచేత, పరమాత్మను, ప్రపంచాన్ని ఒకటిగా పల్కడానికి ముఖ్యహేతువు శరీరాత్మ భావం అనే సంబంధమే అవుతున్నది—< అనేది చక్కగా స్పష్టపడుతున్నది కదా. "సర్వం సమాప్నోషి" అనే వాక్యం పరమ పురుషుని పరమకృప మూలంగా దివ్యనేత్రాన్ని పొందిన అర్జునునిచే, ఆ నేత్రంతో ఆ పరమాత్మ సమక్షంలోనే చెప్పబడింది అనేది ప్రసిద్ధం కనుక, ఇది యథార్థాన్ని తెలుపడానికి తగిన ప్రమాణం అవుతున్నది.

ఇక, "ఇటువంటి పరమాత్మ (విశిష్ట వస్తువు అయిన బ్రహ్మం) పురుషోత్తముడైన నారాయణుడే అవుతున్నాడు"— అనే విషయాన్ని 15వ అధ్యాయంలో ఉండే ఈ క్రింది శ్లోకాల వల్ల తెలియవచ్చు.

**"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,**
**క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర ఉచ్యతే,**
**ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,**
**యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః,**
**యస్మాత్ క్షరమతీతో ఽ హ మక్షరాదపి చోత్తమః,**
**అతో ఽ స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః",**

"చతుర్ముఖ బ్రహ్మ మొదలుకొని గడ్డి పరక వరకు ఉండే వస్తువులు క్షరశబ్దంచేత, ముక్తాత్మలు అక్షర శబ్దంచేత చెప్పబడుతున్నారు. పురుషోత్తముడైతే, ఈ బద్ధులు, ముక్తులు అనే రెండు విధాలుగా ఉండే జీవాత్మలకంటే భిన్నమైనవాడు. పరమాత్మ అని చెప్పబడేవాడు. ఈ పరుడు అచేతనం, అచేతనంతో కూడిన జీవుడు, కొంతకాలం అచేతనమైన శరీరంలో ఉండి, తరువాత వెలువడిన జీవుడు— అనే వీరిలో ఆత్మగా ప్రవేశించి, వారిని ధరించి, నియమించి స్వామిగా ఉన్నాడు. అందుచేత ఈ పరమాత్మను అయిన నేనే పురుషోత్తముడను— అని ప్రసిద్ధంగా ఉన్నాను" అనేది ఈ శ్లోకాలలోని తాత్పర్యం.

ఇందువల్ల, చేతనాచేతనాలతో కూడిన పురుషోత్తమునే (చేతనాచేతనాలను శరీరంగా కలిగిన నారాయణునే) ఉన్నతమైన తత్వంగా గీత తెలుపుతున్నది— అని స్పష్టపడుతున్నది. "శరీరాన్ని రక్షించేవాడు ఆత్మ" అనే విషయం, "శరీరానికి ఆత్మ తృప్తియే ఫలం" అనే విషయం లోకప్రసిద్ధమైనవి. ఈ క్రమాన్ని గమనించి చూసినట్టయితే, "ప్రపంచం అనే శరీరాన్ని రక్షించేవాడు పరమాత్మ" అనే విషయం, "ప్రపంచానికి పరమాత్మ ప్రయోజనం" అనే విషయం గీతలోని సారమైన అర్థంగా ప్రకాశిస్తున్నది కదా. ఇంతవరకు చెప్పిన దానిని బట్టి, విశిష్టాద్వైతశబ్దార్థాన్ని, ప్రపంచానికి, పరమాత్మకు మధ్య ఉండే శరీరాత్మభావం అనే సంబంధాన్ని, "నేనే ప్రపంచంగా అవుతున్నాను" అని తనను, ప్రపంచాన్ని ఒకటిగా పలికే పరమాత్మ

సూక్తిలోని తత్వాన్ని, (ఈ విధంగా ఉండే విశిష్టాద్వైత సిద్ధాంతానికే తగిన విషయాలను) పైన తెలిపిన గీతాశ్లోకాల ద్వారా ఒక విధంగా తెలిసికొన్నాము. ఈ విధం, గా విస్తృతి లేకుండా, విశిష్టాద్వైతం గీతలోని అంతరార్థంగా వ్యక్తమవుతున్నది— అనేది యథామతి ఇక్కడ విన్నపించబడింది.

★★★★

# భగవద్గీతలోని సారార్థం

(ఉ. వే. శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్యస్వామివారు అనుగ్రహించిన ద్రావిడ వ్యాసానికి అనువాదం)

భారత యుద్ధారంభ కాలంలో కలత చెందిన అర్జునుడు "నీవు ఆచార్యుడవు, నేను నీకు శిష్యుడను, నాకు హితాన్ని ఉపదేశించాలి" అని శరణు పొంది ప్రార్థించగా, భగవంతుడు అతనిని నెపంగా చేసికొని, అందరికీ హితాన్ని గీతలో ఉపదేశించాడు అనే చరిత్ర మొట్టమొదట అనుభవించదగినది. ఆ విధంగా ఉపదేశించబడిన హితాలలో భక్తి ప్రపత్తులు ముఖ్యమైనవి.

**"మన్మనా భవ మద్భక్తః మద్యాజీ మాం నమస్కురు,**
**మామేవైష్యసి యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః"**
**"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"**

అనే ఈ రెండు శ్లోకాలు క్రమంగా భక్తిని, ప్రపత్తిని తెలియజేసే శ్లోకాలు. ఈ రెండు శ్లోకాల అర్థాన్ని కొంచెం వివరంగా తెలుసుకుందాం.

చాలా ఉన్నతమైన విషయంలో చాలా తక్కువగా ఉండేవాడు ప్రీతితో చేసే స్మృతి సంతతినే భక్తి అని అంటారు. ఈ విధంగా ఉండే భక్తిని మనం తెలిసేటప్పుడు, చాలా గొప్పదైన విషయం ఒకటి ఉన్నది అనే విషయాన్ని ముందుగా తెలుసుకోవడం చాలా ఆవశ్యకం అవుతున్నది. ఈ క్రమంలో, మొదట తెలియదగిన చాలా ఉన్నతమైన విషయం పరమపురుషుడే —<అనే విషయాన్ని ఆ పరమపురుషుడేడే గీతలో ఈ క్రింద నిర్దేశంపబడే శోకాలలో వ్యక్తం చేశాడు.

**"భూమి రాపోనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ,**

**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా".**

**ఆపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,**

**జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్,**

**"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా,**

**మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ,**

**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణి గణా ఇవ"**

ఈ శ్లోకాలు ఏడవ అధ్యాయంలో ఉన్నాయి.

పరమ పురుషుడు, ఇంకొకరి మూలంగా కాకుండా, తానే స్వయంగా చేసే సృష్టి సమష్టి సృష్టి అని, చతుర్ముఖ బ్రహ్మ మూలంగా చేసే సృష్టి వ్యష్టిసృష్టి అని అంటారు. దేవతలు, మానవులు, పశువులు, పక్షులు, తృణం, చెట్లు చేమలు మొదలైన వ్యష్టి వస్తువులను సృష్టించడం కోసం భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశంఅనే ఐదు భూతాలు, కళ్ళు మొదలైన జ్ఞానేంద్రియాలు, వాక్కు మొదలైన కర్మేంద్రియాలు మనస్సు అనే 11 ఇంద్రియాలు, అహంకారం, మహత్తత్వం—< అని ఈ విధంగా 8 వస్తువులు కారణమై ఉన్నాయి. ఇవి నా సొత్తు. నా ఆశకు తగినట్లు వినియోగం చేయడానికి వీలైనవి. వీటికి అపరా ప్రకృతి అని పేరు. ఇవి జీవాత్మల చేత ధరింపబడేవి. జీవాత్మలకు పరాప్రకృతి అని పేరు. ఆ జీవాత్మలు నా సొత్తు. అంటే, నా అభిమతానికి తగినట్లు వినియోగించడానికి సాధ్యమైనవి. ఈ క్రమంలో అచేతన వస్తువులకు, చేతనవస్తువులకు నేనే స్వామిని.

అంతేకాక, ఈ ప్రపంచాన్ని అంతటినీ సృష్టించి లయం చేసే కారణ వస్తువును నేను. పైన తెలిపిన విధంగా, ఈ ప్రపంచానికి నేను ఒక్కడే స్వామియై. కారణమై ఉన్నదానివల్ల ఏ విధంగా మిక్కిలి గొప్పతనాన్ని కలిగినవాడనో, ఆ విధంగానే, గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి మొదలైన, లెక్కించటానికి సాధ్యం కాని, అంతు లేని వైభవాన్ని

కలిగినవి అయిన కళ్యాణ గుణాలకు సాగరమై ఉండేవాడను కూడా నేను ఒక్కడనే. నాకంటే ఉన్నతమైన ఇంకొక వస్తువు ఏది లేదు. సూత్రంలో, అంటే, నూలుదారంలో మణుల వలె, నాలో ఈ ప్రపంచం ఉన్నది. ఆత్మను నేనే. ఈ ప్రపంచం నాకు శరీరం" అనే ఇది అంతా పైన ప్రస్తావించిన శ్లోకాలలోని తెలియదగిన తాత్పర్యం. దీనివల్ల నారాయణుని పూర్ణావతారం అయిన శ్రీకృష్ణుడే స్వామి, కారణం, మకల్యాణ గుణాలకు సముద్రం, ఆత్మ అనేది తెలియవచ్చు. ఇంతే కాక, భగవద్గీతలో ఉండే పదవ అధ్యాయం, 11వ అధ్యాయం, 15వ అధ్యాయం అనే ఈ అధ్యాయాలలోని సారమైన అర్థాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

## దశమాధ్యాయంలోని సారార్థం

ఏ విధంగా నాయకునకు, నాయకిని విశ్లేషించినట్లయితే, ఆమెను గూర్చిన చింతన, తాను అభిమానించిన నాయకిని విషయ వస్తువుగా కలిగినది అయినందున, మధురంగా ఉంటుందో, ఆ విధంగానే భక్తుడు, పరమ పురుషుని ఒక విధంగా విశ్లేషించినవాడు అయినట్లయితే, ఆ పరమ పురుషుని గూర్చిన చింతన తాను అభిమానించిన ("ఆనందః, ఆనందమయః, ఆనందావహః" అని చెప్పబడే) పరమ పురుషుని విషయంగా కలిగినది అయితే, చాలా మధురంగా ఉంటుంది. ఈ విధంగా, చాలా మధురంగా ఉండే చింతన అనే భక్తి సంసారి చేతనులమైన మనకు మధురంగా ఉండకపోవడానికి కారణం. మనం ఆచరించి, పేర్చి పెట్టుకునే పాపరాశి అవుతున్నది. ఈ పాపం మనలను విడిచి పోతే తప్ప, పైన తెలిపిన భగవద్భక్తి మనకు ఏర్పడదు. ఒకవేళ కలిగినా, వృద్ధి చెందదు అందుచేత, భక్తి కలుగకుండా ఉండడానికి, ఒకవేళ కలిగినా, అది వృద్ధి చెందకండా ఉండడానికి కారణం అయిన మన పాపం మనలను విడిచి వెళ్ళి పోవడానికి ఒక ఉపాయాన్ని మనం తప్పక పొందాలి, ఆ ఉపాయం ఏది అంటే, భగవంతుని కళ్యాణ గుణాలను, విభూతులను యథాతథంగా తెలిసే జ్ఞానమే.

"ఈ విధంగా ఉండే జ్ఞానం మనకు కలగాలి" అని అభిప్రాయంతో శ్రీకృష్ణుడు అర్జునుని ఉద్దేశించి

**"ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్వతః,**
**సో౽వికంప్యేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః"(10—7)**

అని అన్నాడు పరమాచార్యులైన శ్రీయామునులు కూడా పదవ అధ్యాయంలోని సారార్థాన్ని

**"స్వకళ్యాణగుణానంత్యకృత్స్న స్వాధీనతామతిః,**
**భక్త్యుత్పత్తివివృద్ధ్యర్థా విస్తీర్ణా దశమోదితా"**

అనే శ్లోకం ద్వారా పైన తెలియజేసిన రీతిలోనే అనుగ్రహించారు.

### 11వ అధ్యాయంలోని సారార్థం

భగవద్విభూతులను గూర్చి విన్న అర్జునుడు ఆ భగవానుని చూచి "నీ విభూతులను, నీకే తగిన గొప్పతనాలను అన్నిటిని నేను సాక్షాత్తుగా దర్శించాలి. ఆ విధంగా దర్శించి ఆనందించేటట్లు నన్ను అనుగ్రహించాలి" అని ప్రార్థించాడు. ఆ విధంగా ప్రార్థించగా, శ్రీకృష్ణ భగవానుడు కూడా ఆక్రమంలోనే ఆ అర్జునులకు దివ్య దృష్టిని అనుగ్రహించి, తన విభూతులను, తనకే తగిన గొప్పతనాలను అన్నిటిని సాక్షాత్తుగా దర్శించి, ఆనందించేటట్లు చూపించాడు. అర్జునుడు కూడా ఆ విధంగానే, ఒక విధంగా దర్శించి ఆనందించి, శ్రీకృష్ణుని స్తుతించాడు. దివ్యచక్షువును పొందినప్పటికీ ఆ భగవంతుని తేజస్సును (అందరిని సంహరించగలిగే స్వభావాన్ని) దర్శించలేక తపించి మధురమైన సారథివేషాన్నే మళ్లీ పరిగ్రహించాలి అని ప్రార్థించగా, ఆ భగవంతుడు కూడా ఆ విధంగానే సారధ్య వేషాన్ని ధరించి అర్జునుడు ధరించేచెట్లు చేశాడు— అనేది 11 వ అధ్యాయంలోని సారార్థం.

అర్జునుడు విభూతులను తనతిరిమేనిలోని ఒక భాగంలో కలిగి ఉండే ఆ పరమాత్మను నేత్రాలతో దర్శించి స్తుతించిన శ్లోకాలలో" అనంతవీర్యామితవిక్రమ స్త్వం, సర్వం సమాప్నోషి తతోసి సర్వః" అనే శ్లోకం ఒకటి.

ఇందులో ఉండే "సర్వం సమాప్నోషి తతోసి సర్వః" అనే ప్రయోగంలోని అర్థాన్ని కొంచెం వివరించి పలుకుతాను.

భగవద్రామానుజులు, పైన ప్రస్తావించిన భాగానికి, "చేతనా చేతన వస్తువులను కలిగి ఉండే నీవు, ఆ చేతనాచేతన వస్తువులలో దేనిని విడవకుండా, ప్రతి వస్తువులోనూ నిండుగా వ్యాపించి ఉన్నందున, వాటిని తెలిపే "సర్వః" అనే శబ్దానికి అర్థమై ఉన్నావు "అనే అభిప్రాయాన్ని అనుగ్రహించారు.

మిగిలిన సంప్రదాయాలకు చెందిన ఆచార్యులు, ఈ ప్రయోగానికి పైన తెలిపిన విధంగా అభిప్రాయాన్ని తెలియజేయలేదు. ఇక్కడ భగవద్రామానుజులు చూపిన అర్థం చాలాయుక్తమైనది— అనే విషయాన్ని కొంచెం వివరించి తెలుపుతాను.

"సర్వం ఖలు ఇదం బ్రహ్మ "అనేది ఒక శ్రుతి వాక్యం. ఈ వాక్యంలోని అర్థాన్ని "సర్వం సమాప్నోషి తతోసి సర్వః" అనే భగవంతని ఉక్తి వివరించి పలుకుతున్నది. ఇక్కడ, అద్వైతులు, ద్వైతులు అనే వీరు చెప్పే అర్థాన్ని మొదట తెలిపి, తరువాత విశిష్టాద్వైతులు చెప్పే అర్థాన్ని తెలియజేస్తాను.

"సర్వం ఖలు ఇదం బ్రహ్మ" అనే వాక్యం — అద్వైతులు.

ఒకడు దారాన్ని చూచి దానిని పాము అని అనుకున్నాడు. అతడే తరువాత ఆ దారాన్ని పాము కాదు, జలధార అని తెలుసుకున్నాడు. ఆ తరువాత అతడే ఆ దారాన్ని భూమిలోని పగులు అని కూడా తెలుసుకున్నాడు. ఈ జ్ఞానాలు అన్ని భ్రమ అని అనబడతాయి. దారాన్ని పాము మొదలైన వాటిని క్రమంగా అధిష్టానం అని అత్యాసం

అని అంట దారమే నిజమైన వస్తువు. సర్పం మొదలైనవి వాస్తవమైన వస్తువులు కాదు, దోషాల చేత తోచిన వస్తువులు అవి.

ఈ విధంగానే, బ్రహ్మమే నిజమైన వస్తువు. దారంవలె అధిష్టానం. దేవుడు, మానవుడు, పశువు, పక్షి, చెట్లు చేమలు మొదలైనవి నిజమైన వస్తువులు కాదు. దోషాల చేత (అవిద్య చేత) తోచే వస్తువులు, అంతే. పాము మొదలైనవి అన్నీ దారమే అని అంటే, "దారం కాకుండా మిగిలినవి ఏది వాస్తవానికి లేదు" అని ఏ విధంగా మనం గ్రహిస్తున్నామో ఆ విధంగానే, "అంతా బ్రహ్మం" అనేదానికి బ్రహ్మం తప్ప, అన్ని అనే ఈ ప్రపంచం వాస్తవానికి లేదు అనేదే అర్థం. అధిష్ఠానాన్ని, అధ్యస్తాన్ని ఒకటిగా చెప్పడమే "సర్వం బ్రహ్మ" అని. ఇదే అద్వైతులు చెప్పే అర్థం. అయితే, అద్వైతులు చెప్పే పైన తెలిపిన అర్థం "సర్వం సమాప్నోషి తతోసి సర్వః" అనే వాక్యంలో మనకు గోచరించదు.

"సర్వం ఖలు ఇదం బ్రహ్మ "అనే వాక్యం — ద్వైతులు

బ్రహ్మం వలె ప్రపంచం కూడా యథార్థమైన వస్తువు. అయినా, బ్రహ్మానికి, ప్రపంచానికి మధ్య ఉండే సంబంధం— జీవునకు, చేతులు, కాళ్లు మొదలైన అంగాలతో కూడిన పిండానికి మధ్య ఉండే శరీరాత్మ భావం అనే దగ్గర సంబంధంవలె ఉండే సంబంధం.

## 15వ అధ్యాయంలోని సారార్థం

**"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ,**
**క్షరః సర్వాణి భూతాని కూటస్థో ఽ క్షర ఉచ్యతే,**

**ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః,**

**యస్మాత్ క్షరమతీతో ఽహ మక్షరాపి చోత్తమః,**

**అతో ఽ స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః" (15—16, 17, 18)**

ఈ శ్లోకాల అర్థాన్ని మనస్సులో పెట్టుకొనే పరమాచార్యులైన శ్రీ యామునాచార్యులవారు 15వ అధ్యాయంలోని సారార్థాన్ని గీతార్థసంగ్రహంలోని ఈ క్రింది శ్లోకంలో(19)స్పష్టంగా అనుగ్రహించారు.

**"ఆచిన్మిశ్రాత్ విశుద్ధాచ్చ చేతనాత్ పురుషోత్తమః,**

**వ్యాపనాద్భరణాత్ స్వామ్యాదన్యః పంచదశోదితః"**

పుణ్యం, పాపం అనే ఈ రెండు కర్మలతో ఏర్పడే ఆ యా శరీరాలతో కూడిన జీవుడు బద్ధుడు అని చెప్పబడుతున్నాడు. ఆయా శరీరాలలోనుండి విడిపడినవాడు ముక్తుడు అని చెప్పబడుతున్నాడు.

"అచిత్తును, బద్ధుడు, ముక్తుడు అనే ఈ రెండు విధాలుగా ఉండే ఈ జీవాత్మలను వ్యాపించి (ఈ మూడు వస్తువులలోనూ వ్యాపించి ఉండి), నియమించి, వాటిని నడిపించే స్వామియై ఉన్నాడు కనుక వీరికంటె వేరైనవాడు, పురుషోత్తముడు "అనేది పై శ్లోకంలోని అభిప్రాయం. (పైన ప్రస్తావించిన గీతాశ్లోకంలో ఉండే కొన్ని పదాలకు ఈ క్రింది విధంగా అర్థాన్ని గ్రహించాలి.

క్షరః —బద్ధుడు, అక్షరః —ముక్తుడు. మొదటి శ్లోకంలో ఉండే లోకశబ్దం ప్రమాణాన్ని, రెండవ శ్లోకంలో ఉండే లోకశబ్దం అచిత్తు, బద్ధుడు, ముక్తుడు—ఈ అనే మూడు విధాలైన తత్వాలను, మూడవ శ్లోకంలో ఉండే లోకశబ్దం స్మృతిని తెలుపుతాయి. )

పైన చెప్పిన 15వ అధ్యాయంలోని సారార్థాన్నితెలిసినవారికి బ్రహ్మానికి, ప్రపంచానికి మధ్య ఉండే సంబంధం శరీరాత్మభావం అని, ఈ ప్రపంచాన్ని శరీరంగా కలిగిన ఆత్మ పురుషోత్తముడు— అని చక్కగా వ్యక్తమవుతున్నది కదా.

ఈ విధంగా ఏడవ, పదవ, 15వ అధ్యాయాలలో పరమపురుషుడు స్వామి(సొత్తును కలవాడు), కారణమై ఉండేవాడు, కల్యాణ గుణాలకు సముద్రంవంటివాడు, ఆత్మ ఈ ప్రపంచాన్ని నిర్దేశించే "సర్వః" అనే శబ్దంచేత చెప్పబడేవాడు, పురుషోత్తముడు— అనే సారార్థాన్ని సంగ్రహంగా తెలియజేయడం జరిగింది. దీనివల్ల భగవంతుడు చాలా గొప్పవాడు— అనేది స్పష్టమవుతుంది. ఈ విధంగా ఉండే చాలా గొప్పవాడైన భగవంతుని విషయంలో చాలా తక్కువవాడైన చేతనుడు ప్రీతితో చేసే స్మృతిసంతతియే భక్తి అని చెప్పబడుతుంది. "ఈ విధమైన భక్తిని పురుషోత్తముడను అయిన నా విషయంలో చేతనుడు చేయాలి, నన్ను ప్రీతితో పూజించాలి. నన్ను ప్రీతితో నమస్కరించాలి "అని భగవానుడు ఉపదేశం చేశాడు. ఈ విధంగా భక్తిని సంగ్రహంగా గమనించాము.

ఇక, "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనే శ్లోకంలో చెప్పబడే ప్రపత్తిని గూర్చిన కొన్ని విషయాలను తెలుసుకుందాం.

**"ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతమం మయా,**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు"**

అనే ఈ శ్లోకంలో పరమ పురుషుడు అర్జునుని ఉద్దేశించి చేసినగీతోపదేశాన్ని తాను ఒక విధంగా పూర్తి చేశాడు. పైన ప్రస్తావించిన శ్లోకం —" నన్ను శరణు పొందిన నిన్నుగూర్చి ఈ ఉపదేశం చేయబడినది. మోక్షాన్ని పొందడానికి సాధనాలు అయిన ఈ కర్మ, జ్ఞాన, భక్తులను చక్కగా గమనించి తెలుసుకొని, నీ స్థితికి తగినట్లుగా వాటిలో ఒక ఉపాయాన్ని నీవు ఆచరించు" అనే అభిప్రాయాన్ని తెలుపుతున్నది. గీతను ఉపదేశంగా పొందిన అర్జునుడు ఈ క్రింది విధంగా విచారించి చూచి, మనసులో కలతను పొందాడు.

పరమపురుషుడు ఉపదేశించిన గీతలో ఉండే కొన్ని వచనాలు— పరమాత్మ ఈ చేతనునకు ఒక కార్యాన్ని చేయడానికి తగిన ప్రయత్నాన్ని శక్తిని అనుగ్రహిస్తున్నాడు, ఆ శక్తితో ఆ జీవుడు తనకు తగిన కర్మలను భగవంతుని ఆరాధనారూపంగా చేయాలి. జీవాత్మచింతనను చేయాలి. పరమాత్మను ప్రీతితో ధ్యానం చేయాలి— అనే యథార్థాన్ని తెలుపుతున్నాయి. మరి కొన్ని వచనాలు —పరమ పురుషుడు ఆత్మ. ఈ చేతనుడు శరీరం. ఈ శరీరం తనకు తానే రక్షించుకొనగలిగినది కాదు. ఆత్మ మాత్రమే శరీర రక్షణాన్ని చేసేవాడు. చాతక పక్షి వర్షజలం కోసం ఏ విధంగా ఎదురుచూస్తుందో, ఆ విధంగా, ఈ భగవంతునకు శరీరభూతుడైన ఈ చేతనుడు తనకు ఆత్మ అయిన పరమ పురుషుని ఎదురు చూడడం ఇతని స్థితికి తగినది —అనే తత్వాన్ని తెలుపుతున్నాయి.

“గీతలో కొన్ని వచనాలు చెప్పిన విధంగా, మనం ప్రయత్నం మన శక్తిని పురస్కరించుకొని చేసి, కర్మ, జ్ఞాన, భక్తులను చేయడమా ? లేక, మరి కొన్ని వచనాలు చెప్పిన విధంగా శరీరాత్మభావమనే సంబంధానికి తగినట్లు అతని కోసమే ఎదురు చూడడమా?” అని ఈ విధమైన సందేహాన్ని అర్జునుడు మనసులో పొందాడు.

అర్జునునకు కలిగిన ఈ విధమైన సందేహాన్ని గమనించిన శ్రీకృష్ణుడు, “నీవు, నీ ప్రయత్నాన్ని, శక్తిని పురస్కరించుకొని కర్మ, జ్ఞాన, భక్తులను చేయకుండా విడచిపెట్టి, ఆత్మ అయిన నన్నే రక్షణగా భావించు. గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి అనే వీటిని కలిగిన నేను— అజ్ఞానం, శక్తి లేకపోవడం— అనే వీటితో కూడి ఉండే నిన్ను, నన్ను పొందనీయకుండా అడ్డుపడే పాపాలనుండి, ముక్తిని కలిగిస్తాను, కలత చెందకు” అని అన్నాడు.

ఈ విధంగా చరమ శ్లోకంలోని అర్థాన్ని గమనించినవారికి, భగవద్గీతలో 10, 11వ, 15వ అధ్యాయాలలో సారార్థంగా ఉపదేశం చేయబడిన జీవ, పరమాత్మలకు తగిన శరీరాత్మభావం అనే సంబంధాన్ని ముఖ్యంగా మనసులో పెట్టుకొని, శరీరం అనే వస్తువును జీవాత్మ రక్షించడం ఆ ఆత్మకు, అంటే, పరమ పురుషునకు తగినది– అనే యథార్థాన్ని తెలియజేసిన విషయాన్ని చక్కగా తెలియవచ్చు.

★★★★

# ఉభయవేదాంతైకకంఠ్యమ్

(కార్పంగాడు వేంకటాచార్య స్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

శ్రియఃపతి అయిన సర్వేశ్వరుని నిర్హేతుకకృపకు పాత్రభూతులైన ఆళ్వారులను మొదలుకొని, శ్రీయామునులను, భగవద్రామానుజులను, వేదాంత దేశికులను మధ్యలో, శ్రీమణవాళ మహామునులను చివరలో కల మన పూర్వాచార్యుల పరంపర —శ్రియఃపతి అయిన నారాయణుడే పరతత్త్వమని, ఆ భగవంతుడే పరమహితం అని, ఆ స్వామి చరణారవిందాలలో పరమ ప్రీతితో చేసే కైంకర్యమే పరమపురుషార్థం అని— ఈ విధంగా తత్త్వహిత పురుషార్థాలను తమ ఉపదేశాలతో గ్రంథాలతో ఆవిష్కరించారు. ఈ విధంగా తత్త్వహిత పురుషార్థాలను యథాతథంగా తెలిసిన చేతనుడే గొప్ప పురుషార్థాన్ని పొందుతున్నాడు.

ఈ తత్త్వ హిత పురుషార్థాలను యథాతథంగా తెలియజేసే శాస్త్రాలలో గొప్ప శాస్త్రం వేదమని చెప్పబడుతున్నది. "వేదశాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్" అనే వచనం ఈ విషయంలో ప్రమాణం. ఆ వేదం, సంస్కృత వేదం, ద్రావిడ వేదం అనే రెండు విభాగాలను కలిగినదై ఉంటుంది. సంస్కృత వేదంవలెనే ద్రావిడవేదం కూడా ఉన్నది— అనే విషయాన్ని "వడమొ*ళ్ళి* మఱై— ఎన్టదు తెన్ మొ*ళ్ళి*మఱై నిఱైత్తిఱే" అనే అ*ళ్ళ*గియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ శ్రీసూక్తిలోను తెలియవచ్చు, "దీని భావం ఏమంటే, "మఱై"అని కేవల వేదరాశిని తెలిపే శబ్దంతో చెప్పడమే సరిపోతూ ఉండగా, అంత మాత్రమే కాకుండా, "వడమొ*ళ్ళి* మఱై" అని (సంస్కృతవేదం) అనే ప్రయోగం ద్రావిడ వేదం కూడా ఉన్నది— అని భావించి కదా చేయబడింది. ప్రతి కోటి లేనప్పుడు, ఈ విధంగా విశేషించి చెప్పవలసిన అవసరం లేదు కదా— అని తాత్పర్యం" అనే శ్రీమణవాళ మహామునుల వ్యాఖ్యాన సూక్తిలోను ఈ విషయం చాలా స్పష్టంగా నిరూపింపబడింది.

ఇక్కడ ద్రావిడ వేదం అని నిర్దేశించడం దేనిని? అంటే, ఆళ్వారుల దివ్య ప్రబంధాలను. అళ్వార్లుల చేత అనుగ్రహింపబడిన ప్రబంధం నిత్యమైన వేదంలో అంతర్భవిస్తుంది అనేది ఏ విధంగా పొసగుతుంది? అని అంటే, "ఋషుల చేత దర్శింపబడి వ్యక్తం చేయబడిన మంత్రాలు వేదంలో చేరినట్లుగానే, ఆళ్వార్లు దర్శించి వ్యక్తం చేసిన ప్రబంధాలు కూడా నిత్యాలు—< అని అనడంలో ఏ విరోధం లేనందుచేత, వాటిని వేదం అని అనడంలో ఏ అడ్డు లేదు. ఆళ్వారుల చేత దర్శింపబడి, వ్యక్తం చేయబడినది దివ్య ప్రబంధం అనే విషయం "ఆమ్నాయానాం ప్రకృతిమపరాం సంహితాం దృష్టవంతమ్" అనే దేశికుల శ్రీసూక్తి వల్ల స్పష్టం అవుతున్నది. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" (సర్వేశ్వరుడు దశరథ చక్రవర్తికి కుమారుడుగా అవతరించినప్పుడు, భగవత్ప్రతిపాదకమైన వేదం కూడా వాల్మీకి భగవానుని నుండి శ్రీరామాయణమై అవతరించింది). అనే స్కంద పురాణ వచనాన్ని అనుసరించి వేదం యొక్క ఆవిర్భావ విశేషంగా శ్రీరామాయణాన్ని చెప్పినట్లుగానే, భగవంతుడు శ్రీరంగం మొదలైన దివ్యదేశాలలో అర్చారూపంతో అవతరించినప్పుడు, ఆ వేదం ఆళ్వారుల ద్వారా దివ్యప్రబంధంగా అవతరించింది— అని సంస్కృత వేదంయొక్క ఆవిర్భావ విశేషంగా కూడా దివ్యప్రబంధం చెప్పబడుతున్నది. ఇందువల్ల ప్రమేయ వస్తువు అయిన సర్వేశ్వరుడు సర్వసులభుడై ఉండే అర్చావతారరూపాన్ని పరిగ్రహించగా, ఆ స్వామిని ప్రతిపాదించే వేదం కూడా సర్వసులభంగాను, సర్వాధికారంగా ఉండే ద్రావిడవేద రూపాన్ని పొందింది— అని తెలుస్తున్నది.

సంస్కృతవేదంలోని పూర్వభాగం భగవంతుని ఆరాధనా రూపమైన కర్మలను తెలుపుతున్నది. ఉత్తరభాగం అనే వేదాంతం ఆరాధ్యుడైన భగవంతుని నేరుగా ప్రతిపాదిస్తున్నది. ఇది ఉపనిషత్ అని కూడా చెప్పబడుతున్నది. ఈ సంస్కృతోపనిషత్ సర్వేశ్వరుని స్వరూపరూప గుణవిభూతిలీలాదులను తెలియజేస్తున్నట్లుగానే, ఆళ్వార్లు

అనుగ్రహించిన దివ్యప్రబంధం కూడా సర్వేశ్వరుని స్వరూప రూప గుణవిభూతి లీలాదులను చాలా స్పష్టంగా తెలియజేస్తున్నందున, ద్రవిడోపనిషత్ అని వేదాంత విత్తులచే వ్యవహరింపబడుతున్నది. దీనిని ద్రవిడోపనిషత్సంగతి, ద్రావిడోపనిషత్తాత్పర్య రత్నావళి అని వ్యవహారింపబడే గ్రంథాల పేర్ల ద్వారా తెలియవచ్చు. ఇక, ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధం ఆళ్వారుల ఉపనిషత్తులలోని అర్థాలను అంతర్భవించుకున్నది— అనే విషయం నిరూపింపబడుతుంది.

## శ్రియఃపతి అయిన నారాయణుడే పరతత్వం

సంస్కృతోపనిషత్తులో "కారణం తు ధ్యేయః" అనే వాక్యంతో "జగత్ కారణ వస్తువే ధ్యానించదగినది" అని నిశ్చయించి, ఆ జగత్కారణం "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయంతి అభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" (దేనినుండి దేవ, మానవ, తిర్యక్ స్థావరాలు పుడుతున్నాయో, ఏ వస్తువువల్ల, పుట్టిన వస్తువులు జీవిస్తున్నాయో, దేనిలో ఈ పుట్టిన వస్తువులు అన్నీ లయ కాలంలో చేరి ఐక్యం అవుతున్నాయో, దానిని తెలుసుకో, అదే బ్రహ్మం) అని బ్రహ్మ శబ్దానికి చెప్పబడే అర్థంగా చెప్పబడుతున్నది. జగత్కారణ వస్తువు అయిన బ్రహ్మం "తదైక్షత, బహుస్యామ్" (సత్ అనే శబ్దం చేత చెప్పబడే కారణ వస్తువు అయిన నేను "అనేకంగా అవుతాను" అని సంకల్పించింది) అని చెప్పబడినందున, అది జ్ఞానం లేని అచేతన వస్తువుల కంటే విలక్షణమైనది అని, "ఆనందమయః" — ఇంత అని పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానంత ఆనంద గుణానికి సముద్రమై ఉండేవాడు —అని చెప్పబడినందున, జ్ఞానాన్ని కలిగిన చేతన వస్తువుల కంటే విలక్షణుడు— అని తెలుస్తున్నది.

"యేనాక్షరం పురుషం వేద సత్యం, ప్రోవాచ, తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్" అని, ఈ జ్ఞానంతో అక్షరుడైన పురుషుని తెలిసినవాడు ఆ బ్రహ్మవిద్యను చెప్పదగినవాడు— అని పలికినందువల్ల, ఆ జగత్కారణవస్తువు పురుషుడని తెలుస్తున్నది.

"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" అనే శ్రుతివాక్యంలో ఆ జగత్కారణవస్తువు అయిన పురుషుడు ఆదిత్యమండలాంతర్వర్తి అని, పుండరీకాక్షుడు అని చెప్పబడుతున్నది, ఇక, ఆ పుండరీకాక్షుడైన పురుషుడు, నారాయణుడు —అని నిరూపింపబడుతుంది.

శైవపురాణంలో— నారాయణుడు ప్రతి దినం వేయి తామర పువ్వులతో శివుని ఆరాధించినట్లు, ఒకనాడు శివుడు అతని భక్తిని పరీక్షించాలని తలచి ఒక తామర పువ్వును కనపడకుండా చేసినట్లు, అప్పుడు అర్చన చేసే నారాయణుడు పుండరీకాక్షుడు కనుక, తన నేత్రపద్మంతో అర్చించినట్లు, అందుచేత శివుడు సంతోషించినవాడై, నారాయణునకు చక్రం ఇచ్చినట్లుగాను చెప్పబడినందున, పుండరీకాక్షుడు, నారాయణుడు అనేది పరపక్షంలో కూడా అంగీకరింపబడినట్లు అయినది.

"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా, నేశానః" అని శ్రతిలో "చతుర్ముఖ బ్రహ్మ, శివుడు పుట్టడానికి ముందే నారాయణుడు ఒక్కడే ఉన్నాడు —అని చెప్పినందువల్ల, ""యథా శంకరశబ్దో ఽ యం మహాదేవే అవతిష్ఠతే, తథా పురుషశబ్దో ఽ యం వాసుదేవే అవతిష్ఠతే"— మహాదేవ శబ్దం శంకర శబ్దం మహాదేవుని నిర్దేశించేటట్లే, పురుష శబ్దం కూడా వాసుదేవుని నిర్దేశిస్తుంది—అని చెప్పినందువల్ల, ఆ జగత్కారణ వస్తువై, పుండరీకాక్షుడై ఉండే పురుషుడు నారాయణుడే అనే విషయం స్పష్టం అవుతున్నది. జగత్తుకు కారణమై ఉండే వస్తువే గొప్పదైన తత్వం అనేది ఉపనిషత్తులలోని సిద్ధాంతం. కనుక, ఇంతకుముందు నిరూపించిన విధంగా శ్రియఃపతి

అయిన నారాయణుడే పరతత్వం అనేది ఆ ఉపనిషత్తులను చక్కగా పరిశీలన చేసేటప్పుడు స్పష్టంగా తెలుస్తుంది.

ఇక, ఆళ్వారుల దివ్యసూక్తులలో ఈ విషయాలే నిరూపింపబడ్డాయి— అనే విషయం నిరూపింపబడుతుంది.

భగవంతునిలో, కారణవస్తువై ఉండడం, భక్తికి విషయమై ఉండడం, కృపను చేసేవాడై ఉండడం— అనే మూడు ధర్మాలు ఒకదానిని విడచి ఇంకొకటి ఉండకుండా, సదా కలసి ఉంటాయి. ఈ మూడు ధర్మాలలో ఒకటి మాత్రం చెప్పబడి, మిగిలిన రెండు చెప్పబడకపోయినప్పటికీ, చెప్పబడిన ధర్మం చెప్పబడని మిగిలిన రెండు ధర్మాలను విడచి ఏనాడు ఉండకుండా, వాటితో కలిసే ఉంటుంది కనుక, అది వాటికి కూడా సూచకంగా అవుతున్నది.

ఆళ్వారులు "మయర్వఱ మదినలమ్ అరుళినన్. "(సంశయం, విపర్యయం మొదలైన అజ్ఞానాలు తొలగిపోయేటట్లుగా స్వాభావికమైన జ్ఞాన, ప్రేమలను తన అనుగ్రహంతో కృప చేశాడు) అని చెప్పినందువల్ల భగవంతుడు కృపను చేసేవాడు— అని స్పష్టంగా తెలుస్తున్నది. కృపను చేసేవాడై ఉండడం— అనే ధర్మం భక్తికి విషయమై ఉండడం, కారవస్తువై ఉండడం— అనే ధర్మాలతో ఒక వస్తువులో కూడి ఉన్నందువల్ల, భగవంతుని గూర్చి ఏర్పడే ఆ ధర్మాలకు, అంటే, భక్తికి, విషయమై ఉండడం, కారణవస్తువై ఉండడం అనే ధర్మాలు సూచితం అవుతున్నవి. అందుచేత, "కారణం తు ధ్యేయః" అనే శ్రుత్యర్థాన్ని" మయర్వఱ మదినలమ్ అరుళినన్" అనే ప్రయోగంలో "అజ్ఞానం నశించేటట్లుగా జ్ఞాన ప్రేమలను తన అనుగ్రహంతో ఇచ్చినవాడు" అని చెప్పినందువల్ల మోక్షకారణత్వం స్పష్టంగా చెప్పబడినట్లయినది. "అవిద్యానివృత్తిరేవ హి మోక్షః" అని అజ్ఞాన నాశమే మోక్షమని చెప్పబడినది. ఆ మోక్షం "జగదుద్భవ స్థితి ప్రణాశ సంసార విమోచనాదయః" అని జగత్తు యొక్క సృష్టి స్థితి సంహారాలు బ్రహ్మ

కార్యాలై ఉన్నట్టే, సంసార విమోచనాన్ని కూడా బ్రహ్మకార్యంగా శ్రీయామునులు అనుగ్రహించిన అందువల్ల, అది బ్రహ్మకార్యంగా చెప్పబడుతున్నది. అందువల్ల కూడా, "కారణం తు ధ్యేయః" అనే శ్రుత్యర్థం ఇక్కడ చెప్పబడింది అనేది స్పష్టం. "కడల్ ఞాలమ్ శెయ్ దేనుమ్ యానే ఎన్నుమ్, కడల్ ఞాలమ్ ఆవేనుమ్ యానే ఎన్నుమ్" అనే పాశురంలో అళ్వార్లు "అహం మను రభవం సూర్యశ్చ" అని, "తద్భావభావమపన్నః తథాసౌ పరమాత్మనా, భవత్యభేదీ" అని, "మత్త స్సర్వ మహం సర్వమ్" అని చెప్పిన విధంగా, భావనాప్రకర్ష చేత తనను అతనినిగా భావించి, "జగత్సృష్టి మొదలైనవానిని చేసినవాడను నేనే" అని భగవంతుని మాటగా చెప్పినందున, "యతో వా ఇమాని భూతాని జాయంతే" అని శ్రుతిలో చెప్పబడ్డ కారణవస్తువు బ్రహ్మమే— అని అర్థం ఇక్కడ స్పష్టంగా చెప్పబడుతున్నది.

"మననకమ్" అనే పాశురంలో "పొఱి యుణర్వవైయిలన్" — ఇంద్రియాలవల్ల ఏర్పడే జ్ఞానానికి విషయమైన అచేతనంవంటివాడు కాదు —అని, "పొఱియుణర్వవై యిలన్" — మానసజ్ఞానానికి విషయమైన చేతనునివంటివాడు కాదు —అని, "ఉణర్ ముழுనలమ్" పూర్తి అయిన జ్ఞానం, పూర్తి అయిన ఆనందం అనే జ్ఞానానందాలను నిరూపంగా కలవాడు— అని చెప్పినందువల్ల, "తద్దైక్షత", "ఆనందమయః" అని శ్రుతిలో చెప్పబడినట్లుగా చేతనాచేతన విలక్షణుడు అనేది స్పష్టం.

**"ఒన్ఱుమ్ దేవుమ్ ఉలకు ముయిరుమ్ మற்றுమ్ యావు మెల్లామన్ఱు నాన్ముగన్ తన్నొడు దేవరులకోడు ఉయిర్ పడైత్తాన్"**

అనే దివ్య సూక్తిలో "తమః పరే దేవ ఏకీభవతి" అని చెప్పిన విధంగా స్వరూపంలో చేరేటట్లుగా లయించే దేవజాతి, వారి వాసస్థానమైన లోకం, మానవులు మొదలైన ప్రాణివర్గం, సమష్టిరూప మహాదాది సకల పదార్థాలు నామరూప విభాగాలను లేనివై, సకల పదార్థాలు సంహృతమైన ఆ నాడు, వీటి సృష్టియోగ్యతానుసంధానంతో

దయమానమనస్కుడై సమష్టి పురుషుడైన బ్రహ్మతో కూడా దేవతావర్గం, లోకాలు, ప్రాణిజాతాలు అనే వీటిని సృష్టించినవాడు— అని అనుగ్రహించినందు వల్ల ఇక్కడ "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా, నేశానః, నేమే ద్యావా పృథివీ" అనే శ్రుతివాక్యంలోని అర్థాన్ని స్పష్టంగా దర్శించవచ్చు.

**"తగుమ్ శీర్ తన్ తనిముదలినుళ్ళే**
**మిగుమ్ దేవుమ్ ఎప్పొరుళుమ్ పడైక్క,**
**తగుమ్ కోల తామరైక్కణ్ణన్ ఎమ్మాన్**
**మిగుమ్ శోది మేలఱివార్ యవరే"**

అనే పాశురంలో అందమైన తామర పువ్వువంటి కన్నులను కలిగిన నా స్వామి అయినవాని కంటే పరంజ్యోతిస్సు, ఇతని కంటే గొప్పదైన వేరొక పరతత్వం ఉన్నది— అని వైదికులలో ఎవరు తెలుసుకుంటారు? అని చెప్పినందువల్ల "తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" అనే శ్రుత్యర్థాన్ని ఇక్కడ చూడవచ్చు.

ఈ విధంగా జగత్తుకు కారణవస్తువై, పుండరీకాక్షుడై, పురుషోత్తముడై ఉండే శ్రీమంతుడైన నారాయణుడే పరతత్వం అనే విషయాన్ని ఉభయ వేదాంతాలను ఆధారంగా చేసికొని యథామతి విజ్ఞాపన చేయబడింది.

ఇక, భగవంతుడే హితం అనే విషయం చూపబడుతుంది.

శ్వేతాశ్వతరోపనిషత్తులో

**"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,**
**తం హ దేవమాత్మ బుద్ధి ప్రసాదం**
**ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే"**

అనే శ్రుతిలో ఎవడు తన నాభకమలంలో చతుర్ముఖ బ్రహ్మను సృష్టించి, జగత్తును సృష్టి చేయటానికి వేదాలను అతనికి ఉపదేశించాడో, ఎవని కృప చేత భగవంతుడే ఉపాయం అనే భక్తికి ప్రకాశం కలుగుతున్నదో, ఆ సర్వేశ్వరుని నేను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను) అని చెప్పినందున భగవంతుడే హితం అనేది ఉపనిషత్తులలో స్పష్టంగా తెలుస్తున్నది.

ఇదే అర్థాన్ని ఆళ్వారులు "ఎన్ ఉణర్విన‌ుళ్ళే ఇరుత్తినేన్, ఆదువుమ్ అవనదు ఇన్నరుళే" అనే పాశురంలో అనుగ్రహించినందువల్ల, భగవంతుడే పరమహితం అనే విషయం ఉభయ వేదాంతాలలో ఒకే విధంగా గ్రహించవచ్చు.

ఇక, పరమపురుషార్థమైన కైంకర్యాన్ని ఉభయ వేదాంతాలు చెబుతున్నాయి— అనే విషయం నిరూపింపబడుతుంది.

"సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అనే శ్రుతిలో "పరమపదంలో భగవంతుని కృపకు పాత్రభూతుడైన చేతనుడు సర్వజ్ఞుడైన పరమపురుషునితో అతని కళ్యాణ గుణాలను అనుభవిస్తాడు— అని భగవద్గుణానుభవం పరమపురుషార్థంగా చెప్పబడింది. భగవంతుని సాటి లేని కళ్యాణ గుణాలను అనుభవించేటప్పుడు, ఈ జీవునకు ఆ గుణం కల వస్తువు విషయంలో, అంటే, భగవంతుని పట్ల, పరమప్రీతి కలుగుతుంది. ఆ ప్రీతి చేత ప్రేరేపింపబడినవాడై అతడు పరిచర్యను చేస్తాడు. ఈ పరిచర్యయే కైంకర్యం అని చెప్పబడుతున్నది. కైంకర్యం అంటే, భగవంతునకు ముఖోల్లాసాన్ని కలిగించే వ్యాపార విశేషం. భగవంతుని పొందడం, ఆ స్వామిని అనుభవించడం, అతని గుణాలను అనుభవించడం— అనే ఇవి ఫలంగా చెప్పే శ్రుతులకు కైంకర్య పర్యంతమైన పురుషార్థాన్ని చెప్పడంలో దృష్టి కనుక, శ్రీవైష్ణవసంప్రదాయంలో కైంకర్యమే పురుషార్థంగా చెప్పబడుతున్నది.

"ఉకందు పణి శెయ్ దు ఉన పాదమ్ పెற்றேన్"— ప్రీతి చేత ప్రేరేపింపబడినవాడనై వాచికమైన కైంకర్యాన్ని చేసి, పరమ ప్రాప్యభూతుడవైన నీ

శ్రీచరణాలను పొందాను— అని, "ఈదే ఎన్నుమ్ వేండువదు ఎందాయ్" — ఈ కైంకర్యమే ఈ ఆత్మ ఉన్నంతవరకు అపేక్షితం, నాకు నిరుపాధికబంధువైనవాడా!" అని ఆళ్వార్లు అనుగ్రహించినందున, ద్రవిడోపనిషత్తులో కూడా కైంకర్యం పురుషార్థంగా చెప్పబడి ఉండడాన్ని తెలియవచ్చు.

ఈ విధంగా, ఉభయవేదాంతాలు ఈ రీతిలో తత్వహిత పురుషార్థాలను ప్రతిపాదిస్తున్నాయి అనే విషయం ఇక్కడ యథామతి నిరూపింపబడింది. సంస్కృతవేదానికి, తిరువాయ్ మొழி ప్రబంధానికి మధ్య ఉండే సామ్యం ఇంకా అనేకవిధాలుగా ఉన్నప్పటికీ, ఇక్కడ విస్తరభీతి చేత ఇంతటితో విరమింపబడుతున్నది. స్వస్తి.

★★★★

## ప్రమాణతమమ్

శ్రీవైష్ణవులమైన మనకు మన మతం— దర్శనం —సిద్ధాంతం— ఏది?అనే విషయాన్ని చాలా స్పష్టంగా ప్రస్తావించి వివరించి పలు విధాలుగా మన ఉజ్జీవనానికి మార్గాన్ని చూపించే మహాగ్రంథం శీభాష్యం. వేదాంతానికి వ్యాఖ్యానమై, వేదాంతవాక్యాలను తగిన న్యాయాలతో పరిశీలించి, మనం తెలుసుకొని పొందవలసిన తత్వ హిత పురుషార్థాలను నిర్ణయించే గ్రంథం శారీరక మీమాంసాశాస్త్రం అనబడే బ్రహ్మసూత్ర ప్రబంధం. ఈ గ్రంథాన్ని అనుగ్రహించినవారు— సాక్షాత్తు నారాయణుని ఆవేశావతార భూతులు, వైదికులు అందరికీ పరమాప్తులు అయిన వేదవ్యాసభగవానులు. ఈ గ్రంథానికి భగవద్రామానుజులు అనుగ్రహించిన భాష్యం శ్రీభాష్యం అనే పేరుతో వ్యవహరింపబడుతున్నది.

ప్రామాణికంగా పరిగ్రహింపబడిన అర్థాన్ని, లేక, అర్థాల సమూహాన్ని సిద్ధాంతం— అని అంటారు. మన సిద్ధాంతం విశిష్టాద్వైతం అని వ్యవహరింపబడుతున్నది. వేదవేదాంత తత్వాలను మూలంగా కలిగినది కనుక ఇది

అనాది, పరమ వైదికం అయిన సిద్ధాంతం అవుతున్నది. దీనికి పరమ వైదిక సిద్ధాంతం అనేదే ప్రాచీనమైన పేరు. సాక్షాత్తు ఆదిశేషుని అవతార రూపులైన మన స్వామి భగవద్రామానుజులు ఈ సిద్ధాంతాన్ని, దీనికి రక్షగా ఏర్పడిన శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని తమ గ్రంథాలతో, ఉపదేశాలతో, అనుష్ఠానాలతో చక్కగా సుస్థిరం చేసి రక్షించి, వ్యాపింప చేసినవారు కనుక, అనాది అయిన ఈ సిద్ధాంతం ఎంబెరుమానార్ దర్శనం అని, లేక, రామానుజ దర్శనం అని వ్యవహరింపబడుతున్నది.

"ఎంబెరుమానార్ దరిశనమ్ ఎన్ఱే ఇదఱ్కు నంబెరుమాళ్ పేరిట్టు నాట్టివైత్తార్" (శ్రీ రంగనాథుడే ఈ దర్శనానికి ఎంబెరుమానార్ దర్శనం అనే పేరును పెట్టి స్థిరపరిచాడు) అని ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో "పొయ్యిలాద మణవాళ మహామునులు" అనుగ్రహించారు. అనాది అయిన మన మతం ఎంబెరుమనార్ దర్శనం అని వ్యవహరింపబడాలి అని చెప్పినవారు — శ్రీరామానుజుల ఐదుగురు ఆచార్యులలో ఒకరైన తిరు క్కోట్టియూర్ నంబి. ఈ విధంగా నియమించేటట్టుగా వారిని ప్రేరణ చేసినవాడు— శ్రీరంగనాథుడు. సంస్కృత భాషలో అందరూ మన దర్శనాన్ని రామానుజ దర్శనం అనే అంటారు.

ఇక, శ్రీభాష్యంలోని గొప్పతనాన్ని అనుసరించి కొన్ని విషయాలు ముందు ముందుగా విన్నవించడం జరుగుతున్నది.

శ్రీవైష్ణవులమైన మనకు ఏ విధంగా ప్రమాణ పరిగ్రహం ఉండాలి ? అనే విషయాన్ని నిశ్చయించేటప్పుడు, శ్రీభాష్యాన్ని మనం ఆశ్రయించవలసిన గొప్ప గ్రంథంగా మన పెద్దలు అనుగ్రహించారు. భగవంతుడు పాల సముద్రాన్ని చిలికినప్పుడు, అందులో నుండి ఆవిర్భవించిన అసార, అల్పసార, సార, సారతర విషయాలను విడిచిపెట్టి, సారతమం అయిన "అముదిల్ వరుమ్ పెణ్ణముదు" అయిన లక్ష్మీదేవినే భగవంతుడు స్వీకరించాడు. ఆ విధంగానే, అతనికి దాసులమైన మనం

కూడా, ప్రమాణాలలో సారతమం అయిన ప్రమాణాన్ని అధికంగా ఆశ్రయించాలి. మన శాస్త్ర సంప్రదాయగ్రంథాలను ప్రమాణం అని, ప్రమాణ తరం అని, ప్రమాణతమం అని విభజించి, వాటిలో ప్రమాణతమం అనేటట్లుగా ఉండే ఉన్నతమైనవి శ్రీభాష్యం మొదలైన గ్రంథాలే అని మన పెద్దలు భావించారు. మనకు కూడా మన పెద్దలు ఆశ్రయించిన ఈ దారియే చాలా గొప్ప మార్గం అవుతున్నది.

పూర్వాచార్యుల అభిప్రాయాన్ని అనుసరించి ప్రమాణాలను సారం అని, సారతరం, అని సారతమం విభజించి అనుగ్రహించారు — యతీంద్రమత దీపికాకారులు. వారికి స్వామి పుష్కరిణి శ్రీనివాసాచార్యులు అని పేరు. వీరు మహాచార్యులైన చండమారుతం దొడ్డయాచార్యస్వామి నలుగురు ప్రధాన శిష్యులలో ఒకరు. ఈ నలుగురిలో ఒకరు నృసింహరాజర్ అనేవారు వీరు వేదాంతదేశికుల శతదూషణి గ్రంథానికి నృసింహరాజీయం అనే ఒక వ్యాఖ్యానాన్ని, తత్వముక్తాకలాపానికి ఒక వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఈ నలుగురు శిష్యులలో మరొకరికి జ్ఞానభూషణం సుదర్శనాచార్యులు అని పేరు. వీరు వేదాంత విజయ దీపిక అనే ఒక గ్రంథాన్ని అనుగ్రహించారు. ఇది, వీరి ఆచార్యులైన దొడ్డయాచార్య స్వామివారు అనుగ్రహించిన వేదాంత విజయం అనే గ్రంథానికి సంగ్రహంగా అమరి ఉన్నది. ఈ గ్రంథం శ్రీవైష్ణవులు ఎవరి దగ్గర లేకుండా పోయింది. సమీప కాలం వరకు జీవించి ఉన్న యదుగిరి యతిరాజ జీయర్ కు పూర్వాశ్రమంలో తండ్రిగారైన (వారు కూడా, యతిరాజ జీయర్ గా వేంచేసి ఉన్న కాలంలో, ) బొంబాయి నగరంలో" బడే మందిర్", అనే చోట ఉండే వల్లభాచార్య సంప్రదాయస్థుల దగ్గరకు వెళ్లి, వారి వద్ద ఉన్న విశిష్టాద్వైత ప్రమాణ గ్రంథాలను అన్నిటిని, (సంగ్రహంగా చెప్పాలంటే, దొడ్డయాచార్య స్వామివారి వేదాంత విజయం అనే గ్రంథంలో అంతర్భవించి ఉండే పంచ విజయ గ్రంథాలను) సంపాదించి తీసుకొని వచ్చారు. గురూపసత్తి విజయం, బ్రహ్మ విద్యా విజయం, సద్విద్యా విజయం, అద్వైత విద్యా విజయం, పరికర విద్యా విజయం అనేవి పంచ విజయ గ్రంథాలు. వీటిలో,

సద్విధ్యా విజయం అనే గ్రంథం మాత్రం ప్రకాశానికి నోచుకున్నది. పారాశర్య విజయం అనేది, వేదాంత విజయంవలె, చండమారుతం దొడ్డయాచార్యులవారి ఇంకొక గ్రంథం. ఇది బ్రహ్మసూత్ర ప్రబంధానికి ఒక వ్యాఖ్యానం. జ్ఞానభూషణం సుందరాచార్యులవారి వేదాంత విజయ మంగళ దీపిక కూడా జీయర్ చేత ప్రకాశింప చేయబడింది.

మహాచార్యులైన చందమరుతం దొడ్డయాచార్యులవారి ఇంకొక శిష్యులు చంపకేశవాచార్యులు అనేవారు. బెంగుళూరుకు దగ్గరలో మైసూరు జిల్లా ఒకటి. ఉన్నది ఈ జిల్లాలో చంపకారణ్యం అనే ఒక ఊరిలో కణ్ణన్ సన్నిధి ఒకటి ఉన్నది. ఆ ఊరికి చెందిన వీరు ఒక గ్రంథాన్ని అనుగ్రహించారు. ఇది, మాధ్వసంప్రదాయస్థులు విశిష్టాద్వైత సిద్ధాంతం పైన చేసే అక్షేపాలను ఖండించే గ్రంథం. మహాచార్యులైన చండమారుతం దొడ్డయాచార్యులవారి ఇంకొక ప్రధాన శిష్యులు యతీంద్రమత దీపిక గ్రంథకర్త అయిన స్వామి పుష్కరిణి శ్రీనివాసాచార్యస్వామి.

“ఇతి వాధూలకులతిలక శ్రీమన్మహాచార్యస్య ప్రథమదాసేన శ్రీవేంకటగిరినాథ స్వామిపుష్కరిణీ గోవిందాచార్యసూనునా శ్రీనివాస దాసేన విరచితా యతీంద్ర మతదీపికాఖ్యా విశిష్టాద్వైత శారీరకపరిభాషా సమాప్తా” అని ఈ గ్రంథం చివరిలో గోచరిస్తున్నందువల్ల, వీరి కొన్ని గొప్పతనాలను మనం తెలుసుకునే అవకాశం కలిగింది. శ్రీభాష్యం మొదలైన గ్రంథాలను రక్షించిన గొప్పతనం మన పూర్వులకు ఉన్నది— అనే విషయాన్ని మనం తెలియాలి— అనే సంగతి కోసమే ఈ విశేషాలను ఇక్కడ తెలియజేయడం జరిగింది.

స్మృతీతిహాస పురాణాలతో కూడిన వేదవేదాంత శాస్త్రాలు మనకి ప్రమాణం. ఈ క్రమం పెద్దలు ఏర్పాటుచేసిన క్రమం. వీటికి మించినవి ప్రమాణతరం అనే రీతిలో

ఏర్పడినవి. అవి దివ్య సూర్యులైన ఆళ్వారులు 12 మంది అనుగ్రహించిన దివ్యప్రబంధాలు. వీటికంటే మించినవి ప్రమాణతమ గ్రంథాలు. అన్నిటిలోనూ ఉన్నతమైనవి— భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీ భాష్యం మొదలైన గ్రంధాలు— అని అంటారు, యతీంద్రమత దీపికాకారులు.

వేదాంత శాస్త్రం ముముక్షువుల కోసమే, అంటే, మోక్షంలో కోరికను కలిగినవారికోసమే అని ఏర్పడిన శాస్త్రం. సంసార విమోచనంలో కోరిక లేకుండా, ప్రాకృత సుఖదుఃఖాలకోసమే మాటిమాటికి అనేక జన్మలను ఎత్తి, సంసారంలో పరిభ్రమిస్తూ ఉండేవారికి మోక్షశాస్త్రం అయిన వేదాంతం ప్రమాణం కాదు. ముముక్షువులకు శాస్త్రం బోధించే తత్త్వత్రయజ్ఞానం ఆవశ్యకం అవుతుంది. తత్త్వత్రయంలో చాలా గొప్పది భగవత్తత్వం. అచిత్తత్త్వాన్ని గూర్చిన జ్ఞానాన్ని పొందడానికి మనం వేదవేదాంతాలలోనూ, ఇతిహాసాలలోను, సాత్త్విక పురాణాలలోనూ చెప్పబడిన విషయాలను మాత్రం గ్రహిస్తే సరిపోతుంది. ముముక్షువులు కానివారికి అచేతనాన్ని గూర్చిన లౌకికమైన నవీన విజ్ఞాన రీతిలో ఉండే పలు విషయాలు ప్రమాణం కావచ్చు. వీటివలె తామసపురాణాలు, సంస్కృత భాషలో ఉండే వేదాంత విరోధం లేని వైద్యశాస్త్రాలు, ఇంద్రజాల విద్యలవంటివి కూడా ప్రమాణం కావచ్చు. ఇవి వేదాంత శాస్త్రానికి విరుద్ధమైతే అప్రమాణాలు అవుతాయి. ఇవి అన్నీ లౌకిక భోగాలను గూర్చి తెలుపడం కోసం వచ్చినవి కావడం చేత, ముముక్షువులకు ఆవశ్యకాలు కాబోవు.

“వేదశాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్” అని తెలిపే శ్రీవేదవ్యాస భగవానుని మార్గంలో వచ్చినవారం, మనం. వేదాన్ని ప్రమాణంగాను, కేశవుని దైవంగాను కలిగిన మనకు సాధించడానికి సాధ్యం కానిది ఏమున్నది? అని అంటారు, మన స్వామి భగవద్రామానుజులు. వేదమనే ప్రమాణాన్ని, వేదవేద్యుడైన ప్రమేయాన్ని అంగీకరించిన మనకు వేదంలో చెప్పబడిన ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం— అన్నీ

సిద్ధిస్తాయి– అని వేదార్థ సంగ్రహంలో మన స్వామి భగవద్రామానుజులు అనుగ్రహించినదానిని సుస్థాపించే గ్రంథం శ్రీభాష్యం. అంతేకాక, ప్రమాణమైన వేదాదిశాస్త్రాలకు, ప్రమాణతరమైన దివ్యప్రబంధాలకు మధ్య ఉండే ఐకకంఠ్యరసాన్ని, అంటే, అభిప్రాయంలో ఐకమత్యాన్ని, చూపించే రీతిలో గొప్పతనం ప్రమాణతమాలైన శ్రీభాష్యాది గ్రంథాలకే ఉన్నది.

**"పురా సూత్రైః వ్యాసః శ్రుతిశతశిరో ఽ ర్థం గ్రథితవాన్**
**వివవ్రే తం శ్రావ్యం వకుళధరతా మేత్య స పునః,**
**ఉభా వేతౌ గ్రంథౌ ఘటయితు మలం యుక్తిభి రసౌ**
**పునః జజ్ఞే రామావరజ ఇతి సబ్రహ్మముకురః"**

(పూర్వం ఒకానొక సమయంలో, శ్రీ వేదవ్యాసులు బ్రహ్మసూత్రాలను పురస్కరించుకొని పలు వేద వాక్యాల అర్థాన్ని వివరించాడు. అతడే, కలియుగం ఆరంభంలో మళ్లీ నమ్మాళ్వారుగా అవతరించి, వేదవాక్యాల అర్థాన్ని చాలా మధురమైన పదాలతో ద్రావిడ వేదాలలో వివరించారు. బ్రహ్మసూత్రాలను, ద్రావిడ వేదాలను యుక్తులతో చక్కగా సమన్వయం చేయడం కోసం అతడే మళ్లీ తిరిగి శ్రీరామానుజులుగా అవతరించారు. వారు పరబ్రహ్మకు అద్దంవంటివారు కదా.)

అని రామానుజ చతుశ్లోకిలో పెరియవాచ్చాన్ పిళ్లై కుమారులైన నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన శ్లోకం మనకు స్పష్టం చేస్తున్నది. ఆదిశేషునిపై శయనించి ఉండే భగవంతుడు తన తిరుముఖ మండలాన్ని చూచుకొని ఆనందించటానికి గరుడుడు అనే అద్దాన్ని ఎల్లప్పుడూ తన పక్కలో పెట్టుకొని ఉంటాడు. శ్రీరామానుజులు. గరుడుని అవతార విశేషంగాకూడా భావింపబడతారు. వీరు అనుగ్రహించిన శ్రీభాష్య గ్రంథం కూడా భగవంతుని మనకు దర్శింపజేయడంతో మాత్రం నిలువకుండా, భగవంతునికే అతని స్వరూపాన్ని దర్శింప చేసే అద్దంగా కూడా ప్రకాశిస్తున్నది. అందుచేత వేదాలు

ప్రమాణం. వాటి నుండి సారాన్ని గ్రహించి ఇచ్చే రీతిలోని దివ్యశాస్త్రం ప్రమాణతరమైన దివ్య ప్రబంధాలు. ప్రమాణాలకు, ప్రమాణ తరాలకు మధ్య విరోధం లేదు. అభిప్రాయంలో ఐక్యమే ఉన్నది— అని మనకు తెలిపే విధంగా ఉండే శాస్త్రం ప్రమాణతమమైన శ్రీభాష్యం అవుతున్నది. ప్రమాణమైన వేదాది శాస్త్రాలను, ప్రమాణతరాలైన దివ్య ప్రబంధాలను సంగ్రహించి, అంటే, చక్కగా గ్రహించి, వాటిని యథాతథంగా సమన్వయంచేసి, శ్రీభాష్యం మొదలైన గ్రంథాలను అనుగ్రహించారు, మన స్వామి భగవద్రామానుజులవారు అనుగ్రహించిన శాస్త్రాలలో మనం గ్రహించి ఆశ్రయించవలసిన అన్ని శాస్త్రాలు అంతర్భవించి ఉన్నాయి. శాస్త్ర, సంప్రదాయ గ్రంథాలలో ఉండే విషయాలను ఆధారంగా గ్రహించే శ్రీరామానుజులు బ్రహ్మసూత్ర ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు అని అన్నందున, ఇది ప్రమాణతమం అనే రీతిలో ఏర్పడి ఉన్నది —అని అంటారు మన పెద్దలు. ప్రమాణం, ప్రమాణ తరం — అనే రెండు ప్రమాణతమానికి మూల భూతాలు— అని దీని భావం.

పరమపదంలో నిత్యసూరులకు అందరికీ నాయకుడై, ప్రకృష్టమైన జ్ఞాన శక్తులను కలవాడై, దివ్య దంపతులకు అనవరతం అంతరంగ కైంకర్యం చేసేవాడై, ఇందువల్ల శేషుడు అనే నిరూపకం నామాన్ని కలిగినవాడై ఉండేవాడు, ఆదిశేషుడు. ఇతడే శ్రీరామావతార కాలంలో లక్ష్మణుడుగా, శ్రీకృష్ణావతార కాలంలో బలరాముడుగా అవతరించాడు. పరమపదంలో దివ్య దంపతులకు కైంకర్యం చేస్తూ ఉండే కాలంలో ఆదిశేషుడు తన మనస్సులో అనవరతం అనుసంధానం చేస్తూ ఉండే శాస్త్రార్థాలను అన్నిటిని అతని అవతార విశేషమైన రామానుజులు సంసారులం అయిన మనం అందరం తెలుసుకొని తరించడంకోసం మనకు అనుగ్రహించారు. ఇది ఆ రామానుజుల పరమకారుణికత్వాన్ని తెలియజేస్తున్నది. పరమ కారుణికత్వం అనే వైలక్షణ్యంతోనే శ్రీరామానుజులు ఎంబెరుమానార్ అనే నిరూపక నామాన్ని పొందారు— అనేది చరిత్ర.

ఏ విధంగా వేదం చేత తెలియపడే పరమ పురుషుడు చక్రవర్తి కుమారుడుగా అవతారం చేసిన కాలంలో వేద పురుషుడు శ్రీరాముడుగా అవతరించాడో, ఆ విధంగానే, పరమపదంలో ఆదిశేషుని మనస్సులో సదా సర్వకాలం మనసులో మెదులుతూ ఉండే శాస్త్రార్థాలు అన్నీ అతడు శ్రీరామానుజులుగా అవతారం చేసిన కాలంలో శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలుగా అవతరించాయి— అనే వాస్తవాన్ని మన ఆచార్యులు స్పష్టంగా తెలియజేశారు. శ్రీరామానుజుల శిష్యులలో ఒకరై, వారికి మడప్పళ్ళి కైంకర్యం చేస్తూ వచ్చిన వడుగనంబి వంశంలో అవతరించిన ఒక ఆచార్య పురుషులు ఈ విశేషాన్ని తెలియజేశారు.

ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో కూడా ఈ "ఇరామానుశన్ మెయ్యన్" అని శ్రీరంగామృత కవి సూచించారు. "మెయ్యన్" అంటే— సత్యశీలుడు —అని అర్థం.

"యథాదృష్టార్థవాదిత్వం సత్యశీలత్వం". సర్వేశ్వరుని రూపగుణ విభూతులను తాము అతనికి పర్యంకంగా ఉండే దశలో దర్శించిన రీతిలోనే అవతారంలో శ్రీభాష్యాన్ని అనుగ్రహించిన సత్యశీలుడు కనుక "మెయ్యన్ "అని అన్నారు", అని శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానం.

నిత్యసూరులకు భగవంతుని వైభవాలు అతని స్వభావాలను గూర్చిన అన్ని అర్థాలు సదా అనుసంధానంలో ఉంటాయి. భగవంతుని సంకల్పం మూలంగా ఇవి దివ్యమైన ఒక క్రమంలో సంసారి జీవాత్మలం అయిన మనం తెలుసుకొని తరించడం కోసం ఇక్కడ ఈ లోకంలో ప్రవర్తింపచేయబడ్డాయి. దివ్యసూరులు అయిన మన ఆళ్వారులు పరమ కరుణతో అనుగ్రహించిన దివ్యప్రబంధాలు కూడా ఈ క్రమంలోనే అవతరించినవై, ప్రకాశిస్తున్నాయి. ఈ విధంగానే, సత్యలోకం, క్షీరాబ్ధి మొదలైన పై లోకాలలో సంచరించే భగవంతుని స్వరూప రూప గుణ విభవ ఐశ్వర్య దివ్య చేష్టితాలను

గూర్చిన అర్థవిశేషాలకు, వీటికి వాచకాలైన దివ్యనామాలవంటివానిని తెలియజేసే శాస్త్రాలు బ్రహ్మ మొదలైన దేవతలచేత, దేవర్షులైన నారదుడు, ఇంకా ఉండే మహర్షుల చేత, పురాణ పురుషులు మూలంగానూ మనం తరించడం కోసం ఆయా కాలవిశేషాలలో ప్రవర్తింపచేయబడ్డాయి. శ్రీరామాయణం, శ్రీభాగవతం — అనే ఈ రెండు బ్రహ్మ దగ్గర నుండి నారదునకు, అతని దగ్గర నుండి మహర్షుల మూలంగానూ మనకు వచ్చి చేరాయి. మన శ్రీవైష్ణవ సంప్రదాయంలో మాత్రమే కాకుండా, మిగిలిన వైష్ణవ సంప్రదాయాలలో కూడా ఈ విధంగా దివ్యమైన శాస్త్రప్రవర్తనలు ఏర్పడి ఉన్నాయి. పై లోకాలలో నడయాడే శాస్త్రార్థాలు మాటిమాటికి ఈ లోకంలో సంసారులు తరించడం కోసం ప్రవర్తింప చేయబడ్డాయి— అనే విషయం ఇతిహాస పురాణాలలో చెప్పబడినది.

"నాథోపజ్ఞం ప్రవృత్తం——— సమ్యక్ యతీంద్రైః" అని వేదాంతాచార్యులవారు అన్నారు. నాథమునులు యోగదశలో నమ్మాళ్వారులను సాక్షాత్కరింప చేసికొని, వారి దగ్గరనుండి అనాది అయిన, మన దర్శనంలోని ప్రమేయార్థాలను ఉపదేశంగా పొందారు. వారి దగ్గర నుండి ఆ ఉపదేశాలను ఉయ్యక్కొండార్, మణక్కాల్ నంబి, ఆళవందార్, వారి ప్రధాన శిష్యులైన పెరియ తిరుమలై నంబి, పెరియ నంబి, తిరుక్కోట్టియూర్ నంబి, తిరుమాలై ఆండాన్, తిరువరంగ ప్పెరుమాళ్ అరైయర్ అనే ఈ ఐదుగురి మూలంగా మన స్వామి ఎంబెరుమానార్లను వచ్చి చేరాయి. వీటిని పరిపూర్ణంగా సంగ్రహించి, ఇవి అందరి దగ్గరకు చక్కగా వ్యాపించి వృద్ధి అయ్యేటట్లు నిర్వహించినవారు — మన స్వామి శ్రీరామానుజులు.

పైన ప్రస్తావించిన వేదాంతదేశికుల శ్లోకంలో "యతీంద్రైః" అని బహువచనం ప్రయోగింపబడింది. మన స్వామి శ్రీరామానులు మాత్రమే కాకుండా, వారిని ఆశ్రయించిన ఎంబార్, అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ వంటి పలువురు

“యతీంద్రైః” అనే పదం చేత సూచింపబడ్డారు. “సన్యాసి అయినవాడు నోరు తెరిచి పలికితే అతడు బ్రహ్మను గూర్చి మాత్రమే పలకాలి”— అని అంటాడు, మనువు. లౌకికవ్యవారాలు, వ్యాపారాలు అన్నిటిలోనుండి తొలగి ఉండి, పరమాత్మ చింతనలోనే కాలాన్ని గడపాలి —అనే విషయాన్ని అందరూ పరిగ్రహించారు. గృహస్థాశ్రమంలో ఉన్నప్పటికీ, సన్యాసుల వలెనే ఈ లోకంతో సంగం లేకుండా మన పూర్వాచార్యులు జీవిస్తూ వచ్చారు. కూరేశులు, ముదలియాండాన్ వంటి మహాచార్యులు చరిత్రల వల్ల మనం ఈ వాస్తవాన్ని తెలియవచ్చు. మన పూర్వుల స్థితి కూడా ఇటువంటిదే.

అవతార పురుషులైన మన స్వామి శ్రీరామానుజులు తమను ఆశ్రయించిన ఈ మహానుభావులను సంస్కరించి వారి నుండి కైంకర్యాలను స్వీకరించారు — అనే విషయం ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో చెప్పబడింది. “పల్ కలైయోర్ తామ్ మన్న వంద ఇరామానుశన్”(1) అనే ప్రయోగంలో ఈ అర్థాన్ని గమనించవచ్చు.

అనేక శాస్త్రాలను అధికరించినప్పటికీ, తత్వహిత పురుషార్థాల నిర్ణయం చేయడం తెలియకుండా, దేనిలోనూ ఒక స్థితి లేకుండా ఉండేవారు వాటి యాథాత్మ్యవేదనంచేత సుప్రతిష్ఠితం అయ్యేటట్లుగా అవతరించినవారు, శ్రీరామానుజులు. “అని, సకలశాస్త్రపారీణులైన కూరేశ (కూరత్తాళ్వాన్) కురుకేశ (తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్), గోవింద(ఎంబార్), దాశరథి(ముదలియాండాన్) మొదలైన ఆచార్యులు, ప్రత్యవస్థానం చేసి, ప్రసంగించిన తరువాత శ్రీరామానుజుల విషయీకారంతో తత్వ హిత పురుషార్థ యాథాత్మ్య జ్ఞానాన్ని పొందిన యాదవ ప్రకాశులు, యజ్ఞమూర్తి మొదలైనవారు యథావస్థితజ్ఞానంతో సుప్రతిష్ఠితం అయ్యేటట్లు——— పరమపదంనుండి సర్వేశ్వరుని నియమనంతో వేంచేసిన శ్రీరామానుజులు” అని ఈ ప్రయోగాన్ని పిళ్లైలోకమ్ జీయర్ వ్యాఖ్యానించారు.

తరువాత, వీరిని సహాయంగా చేసుకొని, మన దర్శనం చక్కగా చిగురించి వృద్ధి చెందేటట్లుగా దివ్యమైన ఒక ఆచార్య శిష్యపరంపరను ఆవిర్భవింపజేశారు, మన స్వామి భగవద్రామానుజులు. శ్రీ వేదవ్యాసమహర్షి అనుగ్రహించిన బ్రహ్మసూత్ర ప్రబంధాన్ని నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని సమన్వయం చేసి, శ్రీభాష్యం మొదలైన గ్రంథాలను అనుగ్రహించారు. వీటిలో, తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలో చూపబడిన అర్థ విశేషాలు అంతర్భవించి ఉన్నాయి. భాష్యకారర్ ఇదు కొండు సూత్రవాక్యంగళ్ ఒరుంగ విడువర్ "అని ఆచార్య హృదయంలో అ*ழ*గియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించడం సుప్రసిద్ధం శాస్త్ర సంప్రదాయాలను రెండిటిని సమన్వయం చేసిన గ్రంథం శ్రీభాష్యం.

శ్రీ భాష్యం, భగవద్విషయం— అనే ఈ రెండిటిలోనూ మనకు అధికారం ఏర్పడాలి అంటే, శ్రీవైష్ణవ దీక్షను పొందడం ఆవశ్యకం. అంటే, పంచ సంస్కారాలు ఏర్పడి ఉండాలి. మనకు రహస్యత్రయంలోని వివరణఃగా (వేదాంతసారమైన రహస్యం యొక్క అర్థాలకు విరోధం లేకుండా) దివ్యప్రబంధాల అర్థ గ్రహణం కలగాలి. మనకు తిరువాయ్ మొ*ழி*లోని, అంటే, దివ్యప్రబంధాలలోని అర్థాలకు విరోధం లేకుండా వేదాంతనికి వ్యాఖ్యానంగా ఏర్పడి ఉండే బ్రహ్మసూత్ర ప్రబంధం యొక్క అర్థగ్రహణం ఏర్పడాలి. శీభాష్యం మొదలైన గ్రంథాలలో మన స్వామి శ్రీరామానుజులు, వారు నియమించిన మహాచార్యులు దీనికి కల మార్గాలను మనకు దర్శింప చేశారు. ఈ దారులను అనుసరించి మన పెద్దలు మన దర్శన ప్రమేయార్థాలను నిర్వహిస్తూ వచ్చారు. ఇదే సత్సంప్రదాయం. ఇదే మన చేత కూడా పరిగ్రహించదగినది అవుతున్నది.

ఇక, శ్రీభాష్యంలో చూపబడిన కొన్ని అర్థాలను గూర్చి ప్రస్తావింపబడుతున్నది.

బ్రహ్మసూత్ర ప్రబంధం నాలుగు అధ్యాయాలను కలిగినది. ఈ నాలుగు అధ్యాయాలలో నాలుగు ముఖ్యమైన అర్థాలు చూపబడ్డాయి— అనే విషయాన్ని మనం శ్రీభాష్యాన్ని పురస్కరించుకొని చక్కగా తెలియవచ్చు. ఈ నాలుగు అర్థాలు సంగ్రహంగా మొదట నాలుగు సూత్రాలద్వారా చూపబడ్డాయి.

మొదటి అధ్యాయంలో చెప్పబడేది కారణత్వం. భగవంతుడే జగత్కారణం అని అర్థం. మనుష్యుడు అని చెబితే, అతని దగ్గర మనుష్యత్వం అనే స్వభావం ఉండాలి. ఈ విధంగానే, కారణత్వం అనే స్వభావం కారణమై ఉండేవానిలో ఉండాలి. భగవంతునకు శరీరం ఉన్నదా? లేదా? అని ప్రశ్న. నైయాయకులు భగవంతునకు శరీరం లేదని అంటారు. భగవంతునికి శరీరం ఉన్నది అనేది విశిష్టాద్వైతుల వాదం. భగవంతుని శరీరం లేదు అని అంటే, అతనిని కారణం అని చెప్పడం సాధ్యం కాదు అంటే, అతనికి జగత్కారణత్వాన్ని చెప్పడానికి సాధ్యం కాదు. లోకంలో ఉండే వస్తువులు అన్నిటికీ భగవంతుడు కారణమై ఉన్నాడు. లోకంలో ఎన్నో పదార్థాలు ఉన్నాయి. అవి అన్నీ తత్త్వత్రయం అనే సంఖ్యలో అణగి ఉండేవే. తత్త్వత్రయంలో భగవానుడు కూడా ఒక తత్త్వంగా ఉన్నాడు. అందువల్ల, అతడు కూడా కార్యం అవుతున్నాడు. కొన్ని దర్శనాలలో భగవంతుడు కారణం అని అంగీకరించినప్పటికీ, అద్వైతంలో, విశిష్టాద్వైతంలో తప్ప మిగిలిన ఏ దర్శనంలోనూ అతనిని కార్యవస్తువుగా అంగీకరించరు. మన దర్శనంలో "అతడు కారణం అవుతున్నాడు, కార్యం కూడా అవుతున్నాడు"— అనే వాస్తవం అత్యాశ్చర్యకరంగా చూపబడుతున్నది. సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మం కారణమని, స్థూల చిదచిద్విశిష్ట బ్రహ్మం కార్యం అని మనం అంగీకరిస్తున్నాము.

లోకంలో ఉండే అచేతన పదార్థాలు అన్నీ పరిణామాన్ని చెందుతూ ఉంటాయి. వాటికి స్వరూపంలో, గుణాలలో మార్పు, అంటే, వికారం ఉంటుంది. చేతనులైన జీవాత్మలకు స్వరూపంలో మార్పు ఉండదు ఆత్మ స్వరూపం అనేది మార్పును

పొందకుండా ఎల్లప్పుడూ ఒకే విధంగానే ఉంటుంది జీవాత్మలకు స్వభావంలో, అంటే, వారి ధర్మభూతజ్ఞానం అనే గుణంలో, మార్పు కలుగుతుంది. భగవంతునకు స్వరూపంలో కానీ, స్వభావంలో కానీ మార్పు ఉండదు. జీవాత్మలకు ఏర్పడే వికారాలు జీవాత్మలకు మాత్రమే. అవి జీవాత్మలను శరీరంగా కలిగి ఉండే భగవంతునకు కలుగవు. ఇదే విధంగా, అచేతనాలకు ఏర్పడే వికారాలు అచేతనాలకు మాత్రమే, ఆ అచేతనాలను శరీరంగా కలిగి ఉండే భగవంతునికి ఉండవు. బ్రహ్మం నిర్వికారమైనది—అని వేదాంతం ఘోషిస్తున్నది చేతనా చేతన పదార్థాలకు కలిగే వికారాలు వాటిని శరీరంగా కలిగి ఉండే, శరీరాత్మ భావ సంబంధం మూలంగా, వీటి లోపల అంతర్యామిగా ప్రవేశించి ఉండే భగవంతుడు ఎంత మాత్రం పొందబోడు. చేతనా చేతనాలలో కనిపించే దోషాలు భగవంతుని కలుగవు. భగవంతునకు కారణత్వం మాత్రం ఉన్నది.

నిత్యుడైన భగవంతుడు కార్యం అని చెప్పేటప్పుడు, అతడు సాక్షాత్తుగా కార్యంగా కాబోడు. స్వరూపంతో కాని, స్వభావంతో కానీ మార్పులను పొందే కార్యాలను కలిగినవాడు కనుక, ఇతనికి ఈ విధంగా వచ్చిన కార్యత్వం సద్వారకం అని శాస్త్రాలలో చెప్పబడుతున్నది. ఏ విధంగా ఒక జీవాత్మ అచేతనమైన శరీరంలో ప్రవేశించి ఉండి, శరీరం ఏర్పడి కార్యం అని చెప్పబడేటప్పుడు అంతా తనను కార్యం అని చెప్పేటట్లుగా ఉండే స్వభావాన్ని పొందినవాడై ఉంటాడో, ఆ విధంగానే, భగవంతుడు కూడా కార్యవస్తువు అవుతున్నాడు. అంటే, ఒక జీవాత్మ జన్మించాడు అని చెప్పేటప్పుడు, అతడు దేవుడుగా పుట్టాడు, మానవుడుగా పుట్టాడు, పక్షిగా పుట్టాడు— అని చెబితే, దానికి, ఈ జీవాత్మ దేవుడు, మానవుడు, లేక, పక్షి అనే శరీరాల లోపల ఉండి, వాటిని నియమిస్తూ ఉన్నాడు— అని అర్థం. విధంగానే, జీవాత్మలోపల ఉండి నియమిస్తూ ఉన్నందున, భగవంతుడు కూడా కార్యం అవుతున్నాడు—అని చెప్పవచ్చు. నియామకునకు, అంటే, నియమించేవానికి వికారం లేదు. నియమింపబడే వస్తువుకే వికారం ఉన్నది. నియమనం

మూలంగా వచ్చిన కార్యక్రమాన్ని కలిగిన భగవంతునకు స్వరూపంలోనూ, స్వభావంలోను వికారాలు లేవు. అచేతనమైన శరీరం మూలంగా ఏర్పడే కార్యత్వాన్ని కలిగిన జీవునకు స్వభావంలో వికారమే తప్ప, స్వరూపంలో వికారం లేదు. అచేతనానికి స్వరూపంలోనూ, స్వభావంలోను వికారాలు ఉన్నాయి. భగవంతుడు తన స్వరూపంలో కానీ, స్వభావంలో కానీ వికారం లేనివాడై, అందుచేత, చేతనా చేతన పదార్థాల లోపల ప్రవేశించి, వాటిని నియమించేవాడై ఉన్నందుచేత, తాను కూడా కార్యవస్తువు అవుతున్నాడు. ఈ విధంగా తత్వత్రయం కూడా కార్యం అనే విషయాన్ని మనం తెలియవచ్చు.

కార్యత్వం అనేది ప్రమేయత్వవ్యాపకత్వం. తెలియబడే వస్తువు ప్రమేయం అని అనబడుతున్నది. ఏవైనా, ఒక విధంగా మనం తెలిసే పదార్థాలు అన్నీ, కార్యాలు అనబడుతున్నాయి. కార్యత్వంలో ప్రమేయత్వ వ్యాపకత్వం ఉన్నది. ప్రమేయత్వవ్యాపక కార్యతానిరూపిత కారణత్వానికి ఆశ్రయమై ఉన్నాడు, భగవంతుడు. “ప్రమేయత్వవ్యాపక కార్యతానిరూపిత కారణత్వం బ్రహ్మలక్షణం” అని అర్థం. ప్రమేయత్వం ఉన్నట్లయితే కార్యత్వం ఉంటుంది. కార్యతా అంటే కార్యత్వం. చేతనా చేతన ఈశ్వర పదార్థాలు మూడు కార్యం. కార్యత్వనిరూపిత కారణత్వం బ్రహ్మలక్షణం. ఈ కార్యాలకు కారణం అనేది ఒకటే. అదే సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మం. ఈ విధంగా చేతనా చేతనాలు మూలకారణాలు కాదు, మూల కారణం భగవంతుడే.

రెండవ అధ్యాయంలో చెప్పబడిన విషయం అబాధ్యత్వం. అంటే, భగవంతునకు చెప్పబడే కారణాన్నిగూర్చి ఎవరు ఏ మాట చెప్పడానికి వీలు లేదు— అని అర్థం. “కారణం తు ధ్యేయః” అనే విధంగా ఉపాసకుడు భగవంతుని కారణంగా ఉపాసనం చేయాలి. ఇందువల్లనే భగవంతుని కారణత్వాన్ని ప్రధానంగా పెట్టుకుని, మోక్షశాస్త్రమైన బ్రహ్మసూత్ర ప్రబంధాన్ని అనుగ్రహించారు, వేదవ్యాసులు.

కారణత్వంలోనే భగవంతుని వాత్సల్యం, స్వామిత్వం, సౌశీల్యం, సౌలభ్యం, సర్వజ్ఞత్వం, సర్వశక్తిత్వం, మోక్ష ప్రదత్వం అని మొదలైన అన్ని కళ్యాణ గుణాలు అంతర్భవించి ఉన్నాయి. ఈ విషయాన్ని శ్రీపిళ్లై లోకాచార్యులవారు కూడా రహస్య గ్రంథాలలో అనుగ్రహించారు. వీరు అనుగ్రహించిన అష్టాదశ రహస్యగ్రంథాలను మనం చక్కగా అధ్యయనం చేస్తే, కారణత్వం అనే విషయంలో మనం తెలియవలసిన అర్థాలు అన్నీ బోధపడతాయి.

మూడవ అధ్యాయం సాధనాధ్యాయం అని, ఉపాయాధ్యాయం అని వ్యవహరింపబడుతున్నది. ఈ అధ్యాయంలో ముఖ్యంగా చెప్పబడిన విషయం భగవంతుని ఉపాయత్వం. భగవంతుని ఉపాయత్వం— ఫలకారణత్వం అని, ఫలప్రదత్వం అని రెండు విధాలుగా ఉంటుంది. భగవంతుడు ఫల కారణంగాను, ఫలప్రదుడుగాను ఉంటూ, మనకు ఉపాయభూతుడు అవుతున్నాడు— అనే విషయాన్ని మనం మన సంప్రదాయంలో ముఖ్యంగా గ్రహిస్తున్నాము. ఫలాన్ని ఇచ్చేవాడు భగవంతుడు ఒక్కడే. ఏది ఫలానికి సాధనమో, అది ఉపాయం అనబడుతుంది. భగవంతుడు కాకుండా, మిగిలిన ఉపాయాలు అయిన కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం మొదలైనవానిని గ్రహించేటప్పుడు, భగవంతుడు ఫలప్రదుడై ఉంటూ, ఉపాయం అవుతున్నాడు. న్యాసవిద్యలో భగవంతుడే ఫలకారణంగానూ, ఫలప్రదుడుగాను ఉంటూ ఉపాయం అవుతున్నాడు. శ్రీభాష్యంలో సాధ్యోపాయాలను గూర్చి చెప్పి, దాని లోపల రహస్యంగా "“అనన్యోపాయత్వశ్రవణాత్” అని భగవంతుని ఉపాయత్వం రహస్యంగా చూపబడింది. బ్రహ్మసూత్ర ప్రబంధంలో న్యాసవిద్య అంతర్భవించిన 32 విధమైన భక్తులు మోక్షోపాయం అనే విషయం వ్యక్తంగా చెప్పబడింది. మన స్వామి భగవద్రామానుజుల గ్రంథాలను క్రమక్రమంగా అధ్యయనం చేస్తూ వెళితే, ఈ విషయంలో మనం స్పష్టతను పొందవచ్చు. గీతాభాష్యంలో ప్రపత్తిని భక్తియోగానికి అంగంగా అనుగ్రహించిన శ్రీరామానుజులు శరణాగతి గద్యలో

ఫలభక్తికి ప్రాప్య భక్తికి సాధనంగా (అధికారి విశేషణంగా)ఉండే స్వతంత్రపతిని గూర్చి అనుగ్రహించారు. ప్రపత్తి, శరణాగతి అనేవి భగవంతుని తెలియజేస్తాయి— అనేది సంప్రదాయం. ఈ విధంగా ఉపాయాన్ని గూర్చి క్రమక్రమంగా మనం అధ్యయనం చేసేటట్లుగా శ్రీ రామానుజుల గ్రంథాలు ఏర్పడి ఉన్నాయి. వీటి మధ్య విరోధం ఉన్నది— అని మనం భావించరాదు. మనం ఎల్లప్పుడూ మొదటి మెట్టును ఎక్కి, తరువాత దాని నుండి రెండవ మెట్టుకు వెళ్లాలి, తరువాత రెండవ మెట్టు నుండి మూడవ మెట్టుకు వెళ్లాలి —అనడంవంటిదే ఇది కూడా. భగవంతుని ఉపాయత్వాన్ని గూర్చి ఆయా ఆచార్యులు అనుగ్రహించిన విషయాలను ఆయా విధానాలకు తగినట్టుగా మనం గ్రహించాలి. అన్వయించుకోవాలి.

బ్రహ్మసూత్ర ప్రబంధంలోని నాలుగవ అధ్యాయం పలాధ్యాయం అనబడుతుంది. అందులో, "భగవంతుడే ఉపేయం" అని చెప్పబడింది. మనం పొందవలసిన ఫలం, పరమ పురుషార్థం భగవంతుడే— అని దీని తాత్పర్యం. ధర్మం, అర్థం, కామం, మోక్షం అని లోకంలో పురుషార్థాలు నాలుగు అని మనం చూస్తున్నాం. జీవాత్మ తనను తాను అనుభవిస్తూ ఉండే కైవల్యం అనేది మోక్షంలో అంతర్భవిస్తుంది. ధర్మం, అర్థం, కామం, కైవల్యం అనే నాలుగిటిని విడచియే పరమపురుషార్థమైన భగవత్ప్రాప్తిని పొందాలి. పరమపదంలో పరమపదనాథుని శ్రీచరణాలను చేరి, అతడు, లక్ష్మీదేవి అనే దివ్యదంపతుల విషయంలో సకల విధమైన కైంకర్యాలను వారి మనస్సు ఆనందించేటట్లుగా చేయడమే పరమ పురుషార్థం అనబడే మోక్షం అనబడుతుంది. ఇందులో "చేతన లాభం ఈశ్వరునకే ప్రయోజనం" అనే క్రమంలో మనం మోక్షాన్ని పొందడం కూడా అతని కోసమే అనే భావనయే ముఖ్యమైనది. మనం, "అతని మనసులో కలిగే ఉల్లాసమే ప్రయోజనం"— అనే భావనతోనే ఉండాలి. భగవంతుని "ఫలీ" అని భావించేటప్పుడు, మనకు అతడు ఇచ్చే ఫలం అతడే. అంటే, అతడే పరమపురుషార్థం—

అనే రహస్యం వ్యక్తం అవుతుంది. ఈ అర్థమే నాలుగవ అధ్యాయంలో ముఖ్యంగా చెప్పబడింది.

ఈ అధ్యాయంలో– మొదటి పాదంలోని మొదటి ఆఱు అధికరణాలలో ఉపాయానుష్ఠానంలో ఉండవలసిన ముఖ్యమైన అర్థాలను అనుగ్రహించారు, వేదవ్యాసులు. ఈ అర్థాలను సూక్ష్మంగా గమనిస్తూ వెళితే, తిరుక్కచ్చినంబి మూలంగా వరదరాజస్వామి అనుగ్రహించిన ఆఱు వార్తలు కూడా వీటిలో అంతర్భవించి ఉండడాన్ని మనం గమనించవచ్చు.

★★★★

# భగవత్కటాక్ష వీక్షణమహిమ

భగవంతుని దివ్యావయవాలలో ఏ అవయవం మనకు చాలా ఉద్దేశ్యమైనది? అని గమనించి చూచినప్పుడు, శ్రీచరణాలే రక్షకం అని నిశ్చయం చేసుకోవలసి వస్తుంది. "అంజేల్ ఎన్ఱు కై కవియాయ్" ("భయపడకు "అని నీ అభయహస్తాన్ని చూపించు)అని ప్రార్థించే విధంగా అభయముద్రతో కూడిన శ్రీహస్తమే రక్షకమని భావించవచ్చు.

"విభోః నాభీపద్మో విధిశివనిదానం భగవతః తదన్యభ్రూభంగీ పరవదితి సిద్ధాంతయతి నః" (భగవంతుని నాభీపద్మం భగవంతుడే బ్రహ్మకు, రుద్రునకు మూలభూతుడు అని, మిగిలిన దేవతలు అందరూ కూడా ఆ పరమాత్మ కనుబొమల కదలికలకు లోబడి వర్తించేవారు– అని సిద్ధాంతం చేసి చెబుతున్నది) అని భట్టర్ పలకడానికి మూలమైన "ముదలామ్ తిరువురుమ్ మూన్ఱు ఎన్బర్, ఒన్ఱే ముదలాగుమ్ మూన్ఱుక్కు మెన్బర్, నిగరిలకు కారురువా! నిన్నకత్తదన్ఱే పుకరిలకు తామరైయిన్ పూ" (జగత్కారణభూతమైన తత్వం బ్రహ్మ, విష్ణు, శివుల రూపంలో మూడు విధాలు అని కొందరు అంటారు. ఈ మూడిటికి వేరొక తత్వం మూలమని మరి కొందరు అంటారు. సాటి లేని మేఘంవంటి రూపాన్ని కలిగినవాడా!, గొప్ప ప్రకాశంతో వెలిగే, బ్రహ్మరుద్రులకుకూడా కారణభూతమైన నాభీపద్మం నీ తిరుమేనిలోనే ఉన్నది కదా) (పెరియ తిరువందాది) అనే నమ్మాళ్వారుల పాశురక్రమంలో పరత్వనిర్ణాయకమైన నాభీపద్మమే రక్షకమని భావించవచ్చు. భగవంతుని కటాక్షవీక్షణమే ముఖ్యమైనది– అని నిర్ణయించడంలో కూడా ఔచిత్యం ఉన్నది. "జాయమానం హి పురుషం యం పశ్యే న్మధుసూదనః, సాత్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" (ఎవనిని, అతడు జన్మించే సమయంలో మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడే సాత్వికుడు అని తెలియదగినవాడు. అతడు మోక్షపురుషార్థాన్నిగూర్చి చింతించేవాడు అవుతాడు) అనే

విధంగా మనం జన్మించడానికి ముందే, తల్లి గర్భంలోనే మనలను లక్ష్మిని కలవారినిగా చేసేవి కదా, భగవంతుని కటాక్ష వీక్షణాలు.

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி దివ్యప్రబంధం ప్రారంభంలోనే "తుయరఱు శుడరడి తొழுదు ఎన్ మననే!" (దుఃఖాలను తీర్చే భగవంతుని ప్రకాశించే శ్రీపాదాలను, ఓ మనసా!, నమస్కరించు) అని తమ మనసును ఉద్దేశించి దేవాధిదేవుని శ్రీచరణాలను రక్షకంగా ఉపదేశించినప్పటికీ, తమ మొదటి ప్రబంధం అయిన తిరువిరుత్తంలో "పెరుమ్ కేழలార్ తమ్ పెరుమ్ కణ్ మలర్ పుండరీకమ్ నమ్మేల్ ఒరుంగే పిఱழవైత్తారివ్వకాలమ్, ఒరువర్ నమ్ పోల్ వరుమ్ కేழపవరుళరే" (పరాహస్వామి తన పెద్ద తామర పువ్వులవంటి నేత్రాలు ప్రకాశించేటట్లు మనపై కటాక్షించాడు. ఈ సమయంలో ఎవరైనా ఈ విధంగా తమ కటాక్షాలతో చూశారా?) అని అంటూ ఆ భగవానుని కటాక్షవీక్షణమే తమకు మునుముందుగా ప్రాప్తం అయినదని, అదే తమ క్షేమాలకు అన్నిటికీ మూలకందం అని పలకడాన్ని గమనించవచ్చు. గోదాదేవికూడా "తింగళుమ్ ఆదిత్తియనుమ్ ఎழுన్దాల్పోల్ అంగణ్ ఇరండుమ్ కొండు ఎంగళ్ మేల్ నొక్కుదియేల్ ఎంగళ్ మేల్ శావమ్ ఇழిన్దు"(చంద్రుడు, సూర్యుడు ఉదయించినట్లుగా ఉండే నీ అందమైన రెండు నేత్రాలతో మాపై నీ కటాక్షాలను ప్రసరింపజేసినట్లయితే, మా పాపాలు అన్నీ తీరిపోతాయి) అని పలికినది.

ఇతిహాసపురాణాలలో గమనించి చూద్దాం. "శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛ" అని కబంధుడు చెప్పిన మాట. "సోఽ భ్యగచ్ఛన్మహాతేజాః శబరీం శత్రుసూదనః" (గొప్ప తేజస్సును కలిగిన శ్రీరాముడు శబరిదగ్గరకు వెళ్ళాడు) అనే విధంగా శ్రీరాముడు తానే స్వయంగా వెళ్లి అనుగ్రహించిన, శబరకులానికి చెందిన శబరి "చక్షుషా తవ సౌమ్యేన పూతాఽ స్మి రఘునందన!"(శ్రీరామా! నీ చల్లని కటాక్షంతో నేను పవిత్రతను పొందినదానను అయ్యాను) "నీ అందమైన కటాక్ష వీక్షణాలవల్లనే నా

ప్రాప్తిప్రతిబంధకాలు అన్ని నశించి, నేను పరిశుద్ధురాలను అయ్యాను" అని భగవంతుని దివ్యకటాక్షవీక్షణాల మహిమను తెలియజేసినది.

పాండవులకోసం శ్రీకృష్ణుడు దూతగా వెళ్ళిన కాలంలో, జలప్రవాహం అనేది పల్లంలోకి తానే ప్రవహించినట్లుగా, "నివాసాయ యయౌ వేశ్మ విదురస్య మహాత్మనః" (మహాత్ముడైన విదురుని ఇంటికి శ్రీకృష్ణుడు వెళ్ళాడు) అనే విధంగా విదురుని ఇంటికి తానే వెళ్లి, "విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ" (పవిత్రమైనవి, సాత్వికమైనవి అయిన విదురుడు పెట్టిన అన్నాన్ని భుజించాడు) అని చెప్పినట్లుగా విదురుని హస్తస్పర్శను కలిగినందువల్ల అమృతంవంటి అతడు పెట్టిన అన్నాన్ని ప్రీతితో ఆస్వాదించి, తరువాత దుర్యోధనాధుల సభకు వెళ్లాడు. అక్కడ శత్రువు అయిన దుర్యోధనుడు "జ్ఞానంలో గొప్పవాడైన భీష్మాచార్యుని, జాతిలో గొప్పవాడైన ద్రోణాచార్యుని, సంపదలో గొప్పవాడైన తనను ఉపేక్షించి, క్షుద్రుడైన విదురుని అన్నాన్ని భుజించి వచ్చాడే!" అనే కోపంతో అధిక్షేపంగా పల్కడంలో "భీష్మద్రోణా వతిక్రమ్య మాం చైవ మధుసూదన!, కిమర్థం పుండరీకాక్ష! భుక్తం వృషలభోజనమ్?" (మధుసూదనా! పుండరీకాక్షా!, భీష్మద్రోణులను, నన్ను కూడా కాదని, ఎందుకోసం నీవు శూద్రుని భోజనాన్ని భుజించావు?) అని అన్నాడు. ఇది దుర్యోధనుడు శ్రీకృష్ణుని అధిక్షేపిస్తూ పలికిన ప్రకరణం అనే విషయంలో ఏ సందేహం లేదు. ఆ విధంగా అధిక్షేపిస్తూ పలికేటప్పుడు "మూర్ఖ! మూఢ!" అనే విధంగా నిందాపూర్వకమైన మాటలను పలుకవలసి ఉండగా, "పుండరీకాక్ష!" అని దుర్యోధనుడు సంబోధిస్తున్నాడు. ఈ విషయాన్ని రసికులు లోతుగా విమర్శించి చూడాలి. దీనిని ఇప్పుడు మనం కొత్తగా విమర్శించే జ్ఞానం మనకు ఎక్కడిది? మన పూర్వాచార్యులు విమర్శించి తెలియజేసిన మధురమైన అర్థాన్ని ఇక్కడ ప్రసావించి తెలియజేస్తాను. కోపించి పలుకుతూ ఉన్నప్పటికీ, "పుండరీకాక్ష!" అని సంబోధన చేయడంలో దుర్యోధనుని అభిప్రాయం ఏమిటంటే, "శ్రీకృష్ణా! నీ అందమైన కటాక్షవీక్షణాలతో విదురుడు సకలదురితాలు తీరి,

పరమ పరిశుద్ధుడు అయ్యాడు. అందువల్లనే అతని అన్నాన్ని నీవు ఆదరించి భుజించడం జరిగింది" అని తాను తెలిసికొన్న సమాధానాన్ని పరవశంగానే వ్యక్తం చేశాడు. ఇటువంటి గొప్పతనాన్ని కలిగినది, భగవంతుని దివ్యకటాక్షం.

ఈ విషయం అటు ఉండనివ్వండి. ఈ శ్లోకంలోని ప్రసక్తమైన ఒక విచారాన్ని కొంచెం విమర్శించి చూద్దాం. "కిమర్థం పుండరీకాక్ష! భుక్తం వృషల భోజనమ్" అని దుర్యోధనుడు అడిగినదానికి శ్రీ కృష్ణుడు ఏమని సమాధానం చెప్పి ఉండాలి? ఏమని ప్రతివచనాన్ని పలికి ఉండాలి? అని విమర్శించి చూద్దాం. "వృషల భోజనం భుక్తం" అనేది శ్రీకృష్ణుడు మనసును పుండు పరచే మాట కనుక, ఆ మాటను చెవిన పడగానే కోపంతో ఎర్రబడిన కన్నులతో "పరమభాగవతోత్తముడైన విదురుని వృషలుడు అని అంటున్నావే పాపీ! "అని కఠినంగా పలికి, "అతడు శూద్రుడు కాడు. బ్రాహ్మణోత్తముల కంటే ఉన్నతుడైనవాడు" అని సమాధానాన్ని చెప్పి ఉండాలి. శ్రీకృష్ణుడు అయితే ఆ విధంగా సమాధానాన్ని చెప్పలేదు. విదురుని ఉద్దేశించి ఒక్క మాట కూడా చెప్పకుండా, "ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్, పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః" (రాజా! శత్రువుల అన్నాన్ని తినకూడదు, శత్రువుకు భోజనం పెట్టకూడదు. పాండవులను నీవు ద్వేషిస్తున్నావు. పాండవులు నా ప్రాణాలు సుమా!) అని వేరు విధంగా సమాధానాన్ని చెప్పినట్లుగా కనిపిస్తున్నది. "శత్రువుల వద్ద భోజనాన్ని చేయకూడదు. శత్రువులకు భోజనం పెట్టకూడదు. దుర్యోధనా! నీవు నాకు ప్రాణస్థానీయులైన పాండవులకు ద్వేషివి అయినావు. అందుచేత నేను నీ దగ్గర అన్నాన్ని భుజించకుండా ఉండడం తగినదే —అని ఈ విధమైన సమాధానాన్ని పలికినందున, విదురుని గూర్చి దుర్యోధనుడు చెప్పిన దూషణం శ్రీకృష్ణునకు ఇష్టమే తప్ప, అనిష్టం కాదు— అని కొందరు భావించే అవకాశం ఉన్నది. కొందరు అని అనాలా? నిగమాంతమహాదేశికులే రహస్యత్రయసారంలో ప్రభావ వ్యవస్థాధికారంలో ఈ విధంగా అంటున్నారు. ఇక్కడ ఉండే పంక్తులను గమనించండి.

"దుర్యోధనుడు "భీష్మ ద్రోణా వతిక్రమ్య భుక్తం వృషల భోజనమ్" అని ప్రశ్నించగా, "ద్విషంతం" అని సమాధానాన్ని చెప్పినందున, విదురుని విషయంలో దుర్యోధనుడు చెప్పిన జాతివిశేషాన్ని భగవంతుడు అంగీకరించినట్లు అయినది" అనేవి అక్కడ పంక్తులు. ఆర్యులారా! ఆచార్యసార్వభౌములు "కిమర్థం పుండరీకాక్ష", అనే ప్రయోగంలో మధురమైన అర్థాన్ని దర్శించారు. స్వామి దేశికులు "ద్విషంతం, "అనే సూక్తిలో రస్యమైన అర్థాన్ని దర్శించారు. ఇక్కడ రసికులు గమనించి చెప్పవలసిన విషయం ఏమిటి అంటే, లోకంలో వాదప్రతివాదాలలో చతురులు అయినవారు ప్రతివాదం చేసేటప్పుడు ఒక వాదానికి పలు సమాధానాలను చెప్పడానికి అవకాశం ఉన్నప్పటికీ, వాటిలో ఏది చాలా ముఖ్యంగా భావింపబడుతున్నదో, దానిని వారు చెబుతున్నారు. ప్రస్తుత సందర్భంలో విదురుని ఉత్కర్షం శ్రీకృష్ణునకు ముఖ్యంగా వివక్షితం కాదు. "న శూద్రా భగవద్భక్తా విప్రాః భాగవతాః స్మృతాః" (భగవద్భక్తులు శూద్రులు కారు. భాగవతులు విప్రులుగా చెప్పబడుతున్నారు) "కిమాప్యత్రాభిజాయంతే యోగినః సర్వయోనిషు, ప్రత్యక్షితాత్మనాథానాం నైవ చింత్యం కులాదికమ్" (అన్ని జాతులలోను భగవంతుని ప్రత్యక్షం చేసుకున్న మహనీయులు జన్మిస్తున్నారు. వారి కులం మొదలైనవి విమర్శించదగినవి కావు) అని మొదలైన పలు ప్రమాణాలతో సిద్ధమైన విషయాన్ని ఇక్కడ చెప్పవలసిన ఆవశ్యకత లేదు. "పుండరీకాక్ష!" అని సంబోధించిన దుర్యోధనునకు అది తెలిసియే ఉన్నది. తనకు ప్రాణస్థానీయులైన భాగవతులకు కీడును తలపెట్టినవానిని తన ద్రోహిగా భావిస్తాడు— అనేదే ఇక్కడ ముఖ్యంగా వివక్షితం కనుక, అదే ఇక్కడ చెప్పబడింది. ఇందువల్ల విదురునిగూర్చి దుర్యోధనుడు చెప్పిన దోషాన్ని అంగీకరించినట్లుగా ఏర్పడదు— అనేది పరమాచార్యుల అభిప్రాయం.

★★★★

# భగవద్గీతాసారం

భగవంతుని నిర్హేతుకకృపయే భగవద్గీతలోని సారం. శ్రీవచనభూషణ వ్యాఖ్యానంలో కనిపించే ఐతిహ్యం ఒకటి ఇక్కడ స్మరణకు వస్తున్నది. భగవద్రామానుజులవారి కాలంలో ఆచార్యులు శ్రీరంగనాథుడు వీథిలో వేంచేసే సమయంకోసం ప్రతీక్షిస్తూ ఉన్నప్పుడు, ఆ గోష్ఠిలో ప్రసక్తమైన వార్త ఇది. "ఒక సత్కారాన్ని పొందడంకోసం ఒక ప్రభువు ఇంటి వాకిటిలో వేచి ఉండడం పాపఫలం. ఈనాడు భగవంతుని ఉత్సవాన్ని సేవించడం కోసం ఆ స్వామి వాకిటిలో వేసి ఉండడం ఏమి పుణ్యఫలమో కదా!" అని ఒకరు అన్నారు. దీనికి ఇంకొక ఆచార్యులు ఈ విధంగా అన్నారు "మన వద్ద ఏ విధమైన పుణ్యం ఉండే అవకాశం లేదు. యాదృచ్ఛికంగా ఒక పుణ్యకార్యం మనం చేయడం తటస్థించవచ్చు. కూతురును శ్రీరంగంలో ఉండే ఒక వ్యక్తికి ఇచ్చి వివాహం చేసినవాడు, తన అల్లుని చూడడం కోసం అక్కడకు వస్తే, అది ఒక గొప్ప దివ్యదేశానికి వచ్చినట్లుగా, అక్కడ నివసించే కాలం దివ్యదేశవాసకాలంగా అవుతున్నది కదా. మనం పుణ్యం అని తెలిసి చేయకపోయినప్పటికీ, దానిని పుణ్యంగా భావించి లెక్కించి, మనకు క్షేమాన్ని చేసే భగవంతుడే మనకు పుణ్యం. అతడే మన మూలసుకృతం— అని పిళ్లై తిరునఱైయూర్ అరైయర్ అనే ఆచార్యులు తీర్మానించారట. అందువల్ల భగవంతుడే మనకు మూలసుకృతం.

భగవద్గీత అనేది అర్జునుని వ్యాజంగా చేసుకొని సకలోపనిషత్తుల సారంగా మనకు శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశం. దీనిని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో తాను ఆచరించి చూపించినది. "మాలే! మణివణ్ణా!" అని గోపికలు శ్రీకృష్ణుని దగ్గర కొన్ని వ్రతోపకరణాలను ప్రార్థించారు. "కూడారై వెల్లుమ్ శీర్—— యామ్ పెఱు శమ్మానమ్" అని కొన్ని విషయాలను చెప్పారు. అప్పుడు శ్రీకృష్ణుడు "గోపికలారా! మీరు అడిగినవి అన్నీ కేవలం బయటి విషయాలు. మీరు మీ మనసులో ఏమి భావిస్తున్నారో, అది నాకు

తెలుసు. నా దగ్గర కార్యాన్ని సాధించుకోవడానికి మీరు చేసిన పుణ్యం ఏమున్నది?" అని అంటూ వారిని అడిగాడు. దీనికి గోపికలు "కఱవైకళ్ పిన్ శెన్ఱు" అనే పాశురంలో సమాధానం చెప్పారు. "శ్రీకృష్ణా! ఏ జ్ఞానం కొంచెం కూడా లేని గోపికలము మేము. మా దగ్గర మేము చేర్చి పెట్టుకున్న పుణ్యం అనేది ఏదీ లేదు" అని తమ ఆకించన్యాన్ని తెలియజేశారు. అప్పుడు శ్రీకృష్ణుడు "మీరు సంపాదించుకున్న పుణ్యం ఏమి లేకపోతే, నేను ఏమీ చేయలేను. వచ్చిన దారిలోనే వెళ్లిపోండి" అని అన్నాడు. అప్పుడు గోపికలు సమాధానం పలుకుతూ" ఉందన్నై ప్పిఱవి పిఱందన పుణ్ణియమ్ యాముడయోమ్"— "మా కులంలో నీవు జన్మించే రీతిలోని పుణ్యాన్ని మేము కలిగి ఉన్నాము"— అని అన్నారు. "మేము మా ప్రయత్నంతో సాధించుకున్న పుణ్యం ఏమీ లేదు. మా మధ్యకు వచ్చి జన్మించిన నీవే మా పుణ్యం. పుణ్యానికి పాలు, అన్నం పెట్టి పెంచే పుణ్యాన్ని మేము నీ అనుగ్రహంచేత పొందాము. ఏ కొరత లేని గోవిందా! నీవు మా విషయంలో స్నేహాన్ని కలిగి ఉండేటట్లుగా ఉండడమే మా పుణ్యం. ఏ జ్ఞానం లేనివారి దగ్గర జ్ఞానభక్తులను నీవు ఏ విధంగా ఎదురు చూస్తావు? నీవే మాకు పరమసుకృతమై ఉండగా, ఇంకొక పుణ్యం కావాలా?" అని అన్నారు.

"జీవునకు మూలసుకృతం భగవంతుడే. ఇతనికి ఏర్పడ గలిగిన ఏ మంచికి అయినా మూలం అతని అనుగ్రహమే"— అనేది గీతలో శ్రీకృష్ణుని సూక్తులద్వారా చక్కగా చూపబడింది.

**"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే.**
**తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా"**

ఎల్లప్పుడూ నాలో కూడి ఉండడమే ప్రయోజనంగా తలచి, నా విషయంలో ప్రేమ కలిగినవానికి నేనే దానివల్ల కలిగే పక్వమైన భక్తియోగాన్ని ప్రీతిపూర్వకంగా అనుగ్రహిస్తాను.

నా సహజమైన కరుణవల్లనే నేను వారి మనసులో ఉండి, ప్రకాశించే జ్ఞానప్రకాశంచేత అజ్ఞానంవల్ల ఏర్పడే అంధకారాన్ని పోగొడుతున్నాను.

ఇవి భక్తిని ఉపదేశించే సందర్భంలో భగవంతుడు పలికిన సూక్తులు. భగవంతుని విషయంలో భక్తి ఉన్నట్లయితే, అది అతని కృషిఫలం వల్లనే కలుగుతుంది. ఇది నిర్హేతుకకృపాకార్యం. "సతతయుక్తానామ్" — ఎల్లప్పుడూ చేరి ఉండేవారికి— అని అర్థం. (శ్రీరామునితో ఎల్లప్పుడూ కలసి ఉండే లక్ష్మణునివలె, ) ఈ అవతారంలో సీతాదేవిని విడచి ఉన్న శ్రీరాముడు ఏ నాడు లక్ష్మణుని విడచి ఉండనే లేదు. బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః" అని ఆరంభించి, "అద్యైవాహం గమిష్యామి లక్ష్మణేన గతాంగతిమ్" అని అనడంతో ముగుస్తున్నది. అయితే, ఇక్కడ మన భాష్యకారులు భగవద్రామానుజులు ఈ సూక్తిని "సతతయోగం కాంక్షమాణానామ్" అని వివరించారు. నదిని దాటినవానికి పడవ అక్కరలేదు కదా. ఎల్లప్పుడూ భగవంతునితో కూడి ఉండడం మోక్షస్థితి. దీనిని పొందినవానికి సాధనం ఏదీ అక్కరలేదుకదా. కూడి ఉండాలని కోరేవానికే ఆ ఫలంకోసం ఒక సాధనం ఆవశ్యకం అవుతున్నది. చేరి ఉండేవానికి చేరి ఉండడానికి కావలసినదానిని నేను అనుగ్రహిస్తాను" అని చెప్పడం అర్థమే కాదు. "సతతయోగం కాంక్షమాణానామ్" అనేదే సరసమైన అర్థం. ""యేన భక్తియోగేన తాన్ ఉపయాంతి, తద్బుద్ధియోగం తేషా మహం ప్రీతిపూర్వకం దదామి" అని అన్వయించి, "సతతయోగం కాంక్షమాణానామ్" అని చాలా యుక్తంగా భాష్యాన్ని భగవద్రామానుజులు అనుగ్రహించారు. ఈ అర్థం పైన లభించడానికి వ్యాకరణప్రమాణాన్ని చూపించి స్థాపించారు. "భజతాం తేషా మహం దదామి" భక్తిని కలిగి ఉండేవానికి బుద్ధియోగాన్ని ఇస్తున్నాను— అని అన్నారు. ఇక్కడ "భజ "అనేది అద్వేషం అనే భక్తిని తెలుపుతున్నది.

నరసింహస్వామి ప్రహ్లాదుని వరం ఊరుకోమని అనగా, అతడు "స్వామీ! నీ విషయంలో నాకు భక్తి నిలకడగా ఉండేటట్లు అనుగ్రహించాలి" అని వరాన్ని ప్రార్థించాడు. అప్పుడు ఆ భగవంతుడు "అది ఎల్లప్పుడూ నీకు ఉన్నది కదా. నీవు అడిగి నేను ఇచ్చేటట్లుగా ఉండాలి. నీవు, నీ దగ్గర ఉన్నదానినే అడిగితే నేను వరం ఇచ్చినట్లు కాదు. ఇంకొకటిని కోరుకో" అని అన్నాడు. "భక్తిలో అభినివేశాన్ని పొందినవానికి "నేను దానికి కావలసిన బుద్ధియోగాన్ని ఇస్తాను" అని అనడంలో అర్థం లేదు. పరమ పురుషుని గూర్చిన నిజమైన జ్ఞానం ఏర్పడి, అతనిని పొందాలనే ఆరంభ దశ అద్వేషం అనబడుతుంది. ఈ దశలో ఉన్నవానికి భక్తిలోని పక్వదశను నేను ప్రీతి పూర్వకంగా అనుగ్రహిస్తాను" అని ఇక్కడ భాష్యం అమరి ఉన్నది.

17వ శ్లోకం ముందు శ్లోకానికి వివరణంగా ఉన్నది. ఇందులో, "ఆత్మభావం" అనేదానికి ఒక మనోవృత్తి అని అర్థం. (అంటే, చిత్తవ్యాపారం)శ్రీకృష్ణుడు పరమోత్కృష్టుడు అనే జ్ఞానం కలిగినవానికి దివ్యమంగళవిగ్రహంతో అతడు ప్రత్యక్షమై, "ఇతనిని పొందాలి", అనే రుచిని కలిగించి, మిగిలిన విషయాలలో ఉండే ఆశను పోగొట్టి, గొప్పదైన భక్తిని అభివృద్ధి అయ్యేటట్లు అనుగ్రహిస్తాడు. "ప్రీతిపూర్వకం దదామి "— నా ప్రాప్యంగా భావించి ఇస్తాను. మనకు భార్య, బిడ్డలు, ఇల్లు, క్షేత్రాలువంటి లౌకిక విషయాలలోనే ఆశ అధికంగా ఉన్నది. మొదట ఈ విషయప్రావణ్యం మారి, అతని పరమభోగ్యత మన మనసుకు విషయంగా కావాలి. ఆ స్థితిని అతడే అనుగ్రహిస్తాడు. పిళ్లై ఉఅంగా విల్లి దాసర్ కు శ్రీరామానుజులవారి అనుగ్రహంవల్ల భగవంతుడు తనను యథాతథంగా చూపగా, వారి మిగిలిన ఆశలు అన్ని వాటికి అవే నశించిపోయాయి.

భక్తియోగం అనేది భక్తిలోని పక్వదశను తెలుపుతుంది. దీనిని ఆ భగవంతుడే అనుగ్రహించాలి. దీనిని ఇచ్చిన తరువాత, తననే అనుగ్రహిస్తాడు. పక్వదశలో భక్తి, ఇతనికి తానుగానే కలుగడం లేదు. ఆ భగవంతుని అనుగ్రహంచేత

అతడు దానిని ఇవ్వాలి. శ్రీయామునులు కూడా "భగవన్! భక్తిమపి ప్రయచ్ఛ మే" అని భక్తిని అర్థించారు. శ్రీరామానుజులు కూడా "భక్తియుక్తమ్ మామ్ కురుష్వ" అని గద్యలో ప్రార్థించారు.

ఈ విధంగా అతడు అనుగ్రహించగా, మనం పొందవలసినది భక్తి. ఏ మార్గాన్ని అనుసరించేవానికి అయినా ఇది తనకు తానే లభించదు. "కాంక్షమాణానాం దదామి"— "అందులో ఆశను కలిగినవానికి ఇస్తాను" అంటే, భక్తి సహేతుకం కాదా? అనే ప్రశ్న ఇక్కడ ఏర్పడుతుంది అద్వేషం, ఆభిముఖ్యం కలిగినవానికి, దానివల్ల నా దగ్గరకు వచ్చినవానికి నా గొప్పతనం తెలిస్తే, వైముఖ్యం పోయి, ఆభిముఖ్యం కలుగుతుంది. ఆశ లేకపోవడం అనేది తొలగిపోయి, ఆశ కలిగే స్థితి అద్వేషం. అద్వేష, ఆభిముఖ్యాలు కలగడమే "భజతామ్" అనే పదానికి అర్థం. ఇవి యథార్థమైన జ్ఞానంతో ఏర్పడుతున్నాయి. ఇవి నిత్యయోగాన్ని ప్రేరేపిస్తున్నాయి. దీనిని ఇంకా కొంచెం వివరిస్తాను.

ద్వేషం అనేది ఏది? అద్వేష, ఆభిముఖ్యాలు ఏ విధంగా కలుగుతాయి? అని అంటే, ద్వేషం అంటే, పగ ఉన్నదనే. అర్థాన్ని చెప్పాలనే నిర్బంధం లేదు. ఆశ లేకుండా తొలగి ఉండడమే ద్వేషం అని చెప్పవచ్చు వెగటు కలిగి ఉండడం అని కూడా చెప్పవచ్చు. అద్వేషం— అనేది తొలగిపోకుండా ఉండడం— అని అర్థం. భగవంతుడు "త్వం మే" అని మనతో సంబంధాన్ని పురస్కరించుకుని మన దగ్గరకు వస్తే, మనం "అహం మే" అని తొలగిపోకుండా ఉండడమే అద్వేషం అనే స్థితి. అతడు పలికిన "త్వం మే" అనేదానికి అంగీకరించడమే ఆది ముఖ్యం. ఈ అద్వేషం ఆభిముఖ్యం కలగడానికి హేతువు శ్రీకృష్ణపరమాత్మ జగత్స్వామి అనే జ్ఞానం. ఈ జ్ఞానం కలగడానికి శ్రీకృష్ణుడే కారణం అని ఏర్పడితే, ఈ భక్తియోగప్రాప్తి కూడా నిర్హేతుకం— అని ఏర్పడుతుంది. భక్తియోగం అతని వల్లనే కలిగేటట్లుగా, అద్వేష, ఆభిముఖ్యాలు కూడా అతని వల్లనే కలుగుతున్నాయి.

ద్వేషం, అద్వేషం, ఆభిముఖ్యం— అనే ఈ మూడు కూడా మూడు విధాలైన విభిన్న మనోదశలు. జ్ఞానం కూడా మనసు వల్ల ఏర్పడుతుంది. జ్ఞానం ఆత్మధర్మం అవుతున్నది. గీతలో శ్రీకృష్ణుడు పలికిన వచనాలు కొన్ని—

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో**
**మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ,**
**వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః**
**వేదాంతకృత్ వేదవిదేవ చాహమ్.**

అందరి హృదయాలలోనూ నేను నివసిస్తూ ఉన్నాను., ఆ యా జీవుల స్మృతి, మరపు, జ్ఞానం అనే వీటిని నా అధీనంలో కలిగి ఉన్నాను. వేదవేదాంతాలు అన్నిటి చేత తెలియబడేవాడను నేనే. వేదంలో చెప్పబడే ఫలాలను ఇచ్చేవాడను కూడా నేనే.

**బుద్ధిః జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమః శమః,**
**సుఖం దుఃఖం భావో ఽ భావో భయం చాభయ మేవ చ,**
**అహింసా సమతా తుష్టిః తపో దానం యశో ఽ యశః,**
**భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః.**

బుద్ధి, స్వరూప జ్ఞానం, సందేహం లేకపోవడం, సహించడం, నిజాన్ని చెప్పడం, బహిరింద్రియ అంతరింద్రియ నిగ్రహాలు, సుఖదుఃఖాలు, జన్మలు, భయం, భయం లేకపోవడం, అహింస, సమతా దృష్టి, తపస్సు, దానం, కీర్తి, అపకీర్తి— ఇటువంటి అనేక విధాలైన మనఃస్థితులు అన్ని జీవసమూహాలకు నావల్లనే కలుగుతున్నాయి.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽ ర్జున తిష్ఠతి,**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.**

అర్జునా! జీవులందరిని హృదయాలలో భగవానుడు నెలకొని ఉన్నాడు. తన ప్రకృతి అనే మాయతో వాటిని బంధించి, తిప్పుతూ, ఆ సర్వేశ్వరుడు నియమిస్తూ నడపుతున్నాడు. (అటువంటి సర్వేశ్వరుడను నేనే)

మనసు, హృదయం మొదలైనవి అన్ని పర్యాయపదాలు కనుక, ఓకే అర్థంలో ప్రయోగింపబడతాయి. జీవులందరిలోనూ అతడు అంతర్యామిగా ఉండి, వారి సత్తను రక్షిస్తున్నాడు. అంతేకాక, అతడు శరీరంలో ఒక అంగమైన మనసులో ఉండి, మనోవృత్తులను తన అధీనంలో పెట్టుకుంటున్నాడు. పంచమాధ్యాయం 4, 5 శ్లోకాలలో 20 మనోవ్యాపారాలను ప్రస్తావించి, ఆ మనోవృత్తులు అన్నీ తన వల్లనే ఏర్పడుతున్నట్లుగా గీతాచార్యుడు చెప్పాడు.

ఈ విధంగా భక్తియొక్క ఆరంభ దశ అయిన అద్వేష, ఆభిముఖ్యాలు ఏర్పడడం తనవల్లనే— అని భగవానుడు అన్నాడు. తెలుసుకోవడం, స్మరించడం, మరచి పోవడం అన్నీ అతని అధీనాలే— అతడు అనుగ్రహించేవే. అందుచేత, భక్తియొక్క మొదటి దశ అయిన మనోవృత్తి అతడు కలిగించేదే. ఆ తరువాత భక్తి పరిణామదశను పొందడానికి కావలసిన భక్తియోగాన్ని ఇచ్చి, భక్తిని పక్వదశవరకు— ఫలాన్ని ఇచ్చే దశ వరకు వృద్ధిచేసి, చివరిలో ఫలరూపుడైన తనను అతడే ఇస్తున్నాడు— అని గ్రహించాలి.

**“నావినుళ్ నిన్ఱు మలరుమ్ ఞాన క్కలైగళుక్కెల్లామ్**
**ఆవియుమ్ అక్కైయుమ్ దానే అழி పోవ్దు అళిప్పవన్ దానే”**

(జిహ్వాలోనుండి వికసించే శాస్త్రాలకు అన్నిటికీ శరీరం, ప్రాణం అంతా అతడే. వాటిని సృష్టించేవాడు, నశింప జేసేవాడు ఆ భగవంతుడే) (తిరువాయ్ మొழி 1— 9— 8). జ్ఞానసాధనమైన అన్ని శాస్త్రాలయొక్క ఉత్పత్తి, వినాశాలు తన వశంలో కలిగి ఉన్నాడు, భగవంతుడు —అని అంటున్నారు ఆళ్వారులు.

భగవంతుని జాయమానకటాక్షంచేత జ్ఞానం వికసించి, మన దగ్గర ఉండే అద్వేషం తొలగిపోయి, ఆభిముఖ్యం కలిగి, అతనిని పొందాలనే ఇచ్ఛ కూడా కలుగుతున్నది. మిగిలిన మనోవృత్తులు అన్ని ఏ విధంగా అతని అధీనాలో, ఆ విధంగానే అతని విషయంలో భక్తికూడా ఆ భగవంతునివల్లనే కలుగుతున్నది— అని మన ఆచార్యులు నిరూపించారు.

పుత్రుడు తన విషయంలో విధేయుడుగా నడచుకున్నా, లేకపోయినా, తల్లిదండ్రులు ఆ పుత్రుని విషయంలో ప్రేమతోనే ఉండేటట్లు, నిరుపాధిక తల్లి, తండ్రి అయిన సర్వేశ్వరుడు మన విషయంలో ఉండే సంబంధాన్ని పురస్కరించుకుని, ప్రీతిని ప్రదర్శిస్తున్నాడు. తన విషయంలో భక్తిని కలవారి పట్ల భగవంతుడు చాలా ప్రీతిని చూపిస్తాడనే వచనాలు మన గ్రంథాలలో పలుచోట్ల కనిపించినప్పటికీ, నిజానికి ఆ విధంగా కాదు— అనేదే మన ఆచార్యులు తీర్మానించిన భావం.

పుత్రుడు ప్రతికూలుడై ఉన్నప్పటికీ, తల్లిదండ్రులు అతనిని రక్షిస్తూనే ఉంటారు. “ఇరామడమ్ ఊట్టువారై పోలే” (రహస్యంగా మారువేషంలో వెళ్లి, సత్రంలో ఉండే తన పుత్రునకు అన్నాన్ని పెట్టి అతని ఆకలిని తీర్చినట్లుగా) రహస్యంగా దాగి ఉండి అతనికి హితాన్ని కలుగజేస్తారు. అయితే, గుణవంతుడు, అనుకూలుడు అయిన పుత్రుని విషయంలో చూపించే ప్రీతి వలె, ప్రతికూలుడై ఉండే పుత్రుని విషయంలో చూపించే ప్రీతి లోకంలో అందరూ చూసేటట్లుగా వ్యక్తంగా ఉండదు. అందరికీ “తల్లి, తండ్రి, నివాసం, శరణం, సుహృత్తు, గతి, నారాయణుడు” అనేది పొసగుతుంది. ఇది నిరుపాధికం. ఒక జీవునకు శరీరంలో నుండి ఉత్క్రాంతి ఏర్పడేటప్పుడు చాలా శ్రమ కలుగుతుంది. “నణ్ణాదార్ ముఱువలిప్ప నల్లు*ఱ్ఱా*ర్ కరైందేంగ” (శత్రువులు సంతోషించగా, బంధువులు, స్నేహితులు బాధపడగా) అనే విధంగా ఉండే సమయంలో “అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్” (నేను నా భక్తుని స్మరిస్తాను. అతనిని ఉత్తమ గదికి తీసుకొని పోతాను) అని తీసుకొని పోవడం ప్రసిద్ధమైన అర్థం. తన దగ్గరకు

చేరకుండా, యమలోకం పోయే సంతానకోసం తాను చాలా అనుతాపాన్ని పొంది, అతనికి కూడా ఉత్క్రాంతి సమయంలో ఆశ్వాసాన్ని కలిగించి, తన దగ్గరకు తీసుకుని పోవడానికి సాధ్యం కాకుండా ఉన్నందుకు చాలా బాధపడి, యముని దగ్గరకు పంపిస్తాడు— అనే విషయాన్ని శాస్త్రాల ద్వారా తెలియవచ్చు.

అందువల్ల, "మనం ప్రీతి కలిగి ఉండడంచేత అతడు దానికి తగినట్లుగా మన విషయంలో ప్రీతి చేస్తాడు" అని అనడం, భావించడం అతని గొప్పతనానికి చాలా తక్కువే అవుతుంది. ", నిన్ఱ ఆది ప్పిరాన్ నిఱ్క *మఱ్ఱై* ద్దెయ్ వమ్ నాడుదిఱే" (మనకోసం ఆదినాథస్వామి వేంచేసి ఉండగా, మీరు అన్యదైవాలకోసం అన్వేషిస్తున్నారే!) అనే విధంగా అతడు మనలను వేచి ఉండే విషయాన్ని తెలియజేశారు, ఆళ్వా, రులు. సంసారం సమూలంగా నశించే వరకు అతడు నిలుచునే ఉంటాడు. ఈ విధంగా అతడు నిలచి ఉండడం అనేది అతనికి సంసారులమైన మన విషయంలో ఉండే ప్రీతినే చూపిస్తుంది. మనం కలిగి ఉండే ప్రీతి, అతడు మన విషయంలో చూపించే ప్రీతిని స్మరింప చేస్తున్నట్లుగా ఉంటుందే తప్ప, అతని ప్రీతికి కారణం కానే కాదు.

అతనిని "ఎన్ మనత్తుళ్ ఇరుత్తినేన్ "(నా మనస్సులో నిలుపుకున్నాను) అని పలికిన నమ్మాళ్వార్లు వెంటనే "అదువుమ్ అవనదు ఇన్నరుళే" (అది కూడా ఆ భగవానుని మధురమైన కృపయే) అని అన్నారు. "ఇన్నరుళ్"— ఎంత మధురమైనది!, ఆ కృప స్వాభావికమైనది, సహజమైనది— అనే అర్థాన్ని ఇస్తుంది. తిరువాయ్ మొ*ఴి* ప్రబంధాన్ని పాడినది తాము కాదు, తమను ఒక సాధనంగా చేసుకుని భగవంతుడు స్వయంగా పాడాడు —అని, "యానాయ్ తన్నై త్తాన్ పాడి" (తానే స్వయంగా తనను తాను కీర్తించుకొని) అని అంటున్నారు ఆళ్వారులు.

★★★★

# ఛాందోగ్యమ్ —విశిష్టాద్వైతమ్

(ఉ. వే. శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్యస్వామివారి ద్రావిడ వ్యాసానికి అనువాదం)

ధర్మం, అర్థం, కామం, మోక్షం— అనే నాలుగు పురుషార్థాలలో మోక్షం అనేది చాలా విలక్షణమైనది. విశిష్టాద్వైతులైన శ్రీవైష్ణవులు, “పరమపదంలో లక్ష్మీనాథుడైన భగవంతుని దరి చేరి, ఆ స్వామిని సేవించి, ఆ స్వామి ముఖోల్లాసానికి తగిన రీతిలో చేసే దాస్యమే మోక్షం” అని భావిస్తున్నారు. ఆ మోక్షాన్ని, దానిని పొందడానికి తగిన సాధనాన్ని తెలియజేయడానికి వచ్చినవి అయిన గ్రంథాలే ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తులలో సామవేదానికి చెందిన ఉపనిషత్తు ఛాందోగ్యం. ఆ ఛాందోగ్యంలో కొన్ని భాగాలను ఆధారంగా చేసుకుని మన స్వామి శ్రీరామానుజులు శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలలో అనుగ్రహించిన మార్గాలను అనుసరించి, విశిష్టాద్వైతాన్ని దర్శిద్దాము.

విశిష్టాద్వైతం అనే పదానికి “విశిష్టస్య అద్వైతం విశిష్టాద్వైతమ్” అనే విగ్రహవాక్యాన్ని చెబుతారు. విశిష్టస్య— చేతనవస్తువులు, అచేతన వస్తువులు అనే వీటిని శరీరంగా కలిగిన వస్తువుయొక్క, అద్వైతం—, రెండుగా లేకపోవడం— అని అర్థం. అంటే, చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగినది బ్రహ్మం కంటే వేరొక వస్తువు లేదు— అని తాత్పర్యం.

దీనిని లోతుగా గమనించి చూస్తే, “యస్య పృథివీ శరీరమ్”, “ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః” అనే ఉపనిషద్వాక్యాలు దీనినే చెబుతున్నాయి. “బ్రహ్మం ఆత్మ, ప్రపంచం శరీరం, ఆత్మ అయిన ఆ బ్రహ్మం నారాయణుడే” అనే అర్థం ఇక్కడ చక్కగా స్పష్టపడుతుంది.

“ఏ వస్తువు నియమింపబడేదిగా, ధరింపబడేదిగా, అతిశయాన్ని కలిగించగలిగేదిగా ఉంటుందో, ఆ వస్తువు శరీరం, ఏ వస్తువు నియమిస్తున్నదో,

ధరిస్తున్నదో, ఆ శేష వస్తువు చేసే పనిని స్వీకరించి, అతిశయాన్ని పొంది ఆనందిస్తున్నదో, ఆ వస్తువు ఆత్మ— అని క్రమంగా శరీరం, ఆత్మ అనే వీటికి లక్షణం చెప్పబడింది. జీవుడు చేతులు, కాళ్లు మొదలైన అవయవాలతో కూడి ఉండే పిండాన్ని నియమించి, ధరించి, ఆ పిండం చేసే పనిని స్వీకరించి, అతిశయాన్ని పొందుతున్నాడు కనుక, అతనిని ఆత్మ అని, ఆ పిండాన్ని శరీరం అని ఏ విధంగా చెబుతున్నామో, ఆ విధంగానే, పరమాత్మ కూడా చేతనాచేతనాలు అనే ఈ ప్రపంచాన్ని నియమించి, ధరించి, ఆ ప్రపంచం చేసే పనిని స్వీకరించి, అతిశయాన్ని పొందుతున్నాడు కనుక, ఆ పరమాత్మను ఆత్మ అని, ఈ ప్రపంచాన్ని శరీరం అని తెలుసుకోవచ్చు కదా.

ఇంతవరకు చెప్పిన దానినిబట్టి విశిష్టాద్వైతశబ్దార్థాన్ని ప్రపంచం, పరమాత్మ అనే వీటి మధ్య ఉండే శరీరాత్మభావం అనే బంధాన్ని ఒక విధంగా తెలుసుకున్నాం. ఇక, విశిష్టాద్వైత పదానికి ఉండే ముఖ్యమైన ఈ అర్థాలను ఛాందోగ్యంలో కొన్ని భాగాలలో గమనిద్దాం.

శ్వేతకేతువుయొక్క ఉపాఖ్యానం ఈ ఛాందోగ్యంలో ఆరవ ప్రపాఠకంలో మొదట చెప్పబడింది ఈ ఉపాఖ్యానం ఈ క్రింది విధంగా తెలియదగినది.

ఒకానొక సమయంలో ఉద్దాలకుడు అనే మహర్షి తన కుమారుడు శ్వేతకేతువును చూసి “నీవు ఒక ఆచార్యుని ఆశ్రయించి, బ్రహ్మచర్యంతో వేదాలను అధ్యయనం చేసి రా “అని అన్నాడు. 12 సంవత్సరాలు కలిగిన ఆ శ్వేతకేతువు కూడా ఆ విధంగానే గురుకులంలో 12 సంవత్సరాల పాటు అధ్యయనం చేసి, వేదాలను అన్నిటిని గ్రహించి, తన ఇంటికి తిరిగి వచ్చి చేరాడు. వినయం లేకుండా ఉండే ఆ కుమారుని తండ్రి ఉద్దాలకుడు చూశాడు. ఆ అవినయానికి హేతువు అతనికి బ్రహ్మజ్ఞానం లేకపోవడమే— అని గ్రహించాడు. ఉద్దాలకుడు అయితే, కుండకు కుమ్మరివాడు, మన్నువలె ఈ ప్రపంచానికి నిమిత్త, ఉపాదాన కారణాలు బ్రహ్మమే— అనే విషయాన్ని తెలిసిన గొప్ప జ్ఞాని. ఈ ఉద్దాలకుడు, తన కుమారుడు బ్రహ్మజ్ఞానాన్ని పొందాలి అనే

ఆశను పొందాడు. అందువల్ల ఆ కుమారుని చూచి "ఉత తమాదేశ మప్రాక్ష్యః? "అని ప్రశ్నించాడు.

(ఈ వాక్యంతో పాటు "యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మత మవిజ్ఞాతమితి" అనే వాక్యం కూడా కలసి ఉన్నది) ", ఏ వస్తువునుగూర్చి విన్నదానివల్ల అన్ని వస్తువులనుగూర్చి విన్నట్లుగా అవుతున్నదో, ఆ ఆదేశాన్ని, అంటే, అన్ని వస్తువులను నియమించ గలిగినదానినిగూర్చి నీవు నీ ఆచార్యుని దగ్గర ప్రశ్నించావా ? అని అడిగాడు.

ఏ విధంగా, మన్నునుగూర్చి తెలుసుకుంటే ఆ మన్ను కార్యమైన కుండ మొదలైన వస్తువులు తెలియబడినవి అవుతున్నాయో, ఆఏ ఏ విధంగా బంగారు ముద్ద, ఇనుప ముద్ద అనే వీటిని గూర్చి తెలుసుకుంటే, వీటి కార్యాలు తెలియబడినవి అవుతున్నాయో, ఆ విధంగానే, ఈ బ్రహ్మాన్ని గూర్చి తెలుసుకుంటే, దాని కార్యమైన ప్రపంచం తెలియబడినట్లు అవుతుంది— అని అన్నాడు.

ఈ మాటను ఆలకించిన శ్వేతకేతువు "మళ్లీ గురుకులానికి వెళ్లేటట్లుగా నా తండ్రి నన్ను ఆజ్ఞాపిస్తున్నాడా? ఏమి?" అని భయపడి, "నా ఆచార్యుడు ఈ విషయాన్ని తెలియరు. వారు ఈ విషయాన్ని తెలిసినవారు అయితే, గుణశాలి అయిన నాకు ఉపదేశం చేయకుండా ఉండరు. అందుచేత మీరే కృపతో నాకు ఈ విషయాన్ని గురించి ఉపదేశం చేయాలి "అని ప్రార్థించాడు.

తండ్రి అయిన ఉద్దాలకుడు కూడా ప్రేమతో తన పుత్రునకు ఈ క్రింది విధంగా పరబ్రహ్మను గూర్చి ఉపదేశం చేశాడు. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనేది ఉద్దాలకుడు శ్వేతకేతువునకు చేసిన ఉపదేశంలోని మొదటి వాక్యం. "తత్వమసి శ్వేతకేతో!" అనేది చివరి వాక్యం. ఈ రెండు వాక్యాల అర్థాన్ని క్రమంగా ఇక్కడ గమనిద్దాం.

మొదటి వాక్యంలోని తాత్పర్యం ఏమంటే—

బ్రహ్మం అనేది చాలా ఉన్నతమైన సత్పదార్థం. ఈ బ్రహ్మంతో పోలిన, దీనితో పోలి ఉండే చేతనవస్తువులు, దీనితో పోలకుండా ఉండే అచేతనవస్తువులు, జ్ఞానం, శక్తి మొదలైన కళ్యాణ గుణాలు— అనే ఇవి అన్ని సత్పదార్థాలు కనుక, ఈ బ్రహ్మం సవిశేషమై, చేతనాచేతనవస్తువులతో కూడినదై అవుతున్నది. దీనిని "సదేవ" అనే వాక్యంలో మనం చక్కగా స్పష్టంగా గమనించవచ్చు. ఈ వాక్యంలో ఉండే "అగ్రే" అనే పదం సృష్టికి ముందు ఉన్న కాలాన్ని నిర్దేశిస్తుంది. కాలం జ్ఞానశూన్యమైనది. పరబ్రహ్మం అయితే గొప్ప జ్ఞానం కలవాడు. అందుచేత కాలం అనేది బ్రహ్మతో పోలని వస్తువు అనేది మనం తెలిసికొన్న విషయమే. ఇక్కడ "పోలని వస్తువులు, బ్రహ్మం ఉన్నాయి" అని తెలుస్తున్నది కదా. ", బ్రహ్మంతో పోలని వస్తువు ఏదీ లేదు" అనేది వాస్తవమే అయితే, "అగ్రే" అని చెప్పడం పొసగుతుందా? ఎంత మాత్రం సరిపోదు కదా. ఇందువల్ల, "బ్రహ్మకు కంటే విలక్షణమైన వస్తువు ఉన్నది" అనే విషయం తెలుసుకున్నాము.

ఈ శ్రుతివాక్యంలో ఉండే "ఏకమ్" అనే పదం సూక్ష్మదశను సూచిస్తుంది. నామరూపాలు లేని స్థితియే సూక్ష్మదశ అనబడుతుంది. నామరూపాలను పొంది ఉండే స్థితి స్థూలదశ అని చెప్పబడుతుంది. సృష్టికాలంలో ఒక్కొక్కటిని ప్రత్యేక ప్రత్యేకంగా ఉండే నామరూపాలు పొందిన వస్తువులుగానే మనం గమనిస్తున్నాము. ఉపనిషత్తు సృష్టిని చెప్పేటప్పుడు, భగవంతుడు "అనేక వస్తువులుగా కాగలను" అని సంకల్పాన్ని చేసి, ఆ విధంగా అయినట్లుగా చెబుతున్నది. ఈ భాగంలోనే ఉండే "బహు స్యామ్" అనే వాక్యం గమనించదగినది.

ఇంతే కాక, "ఒక దానిని గూర్చి తెలుసుకుంటే, అన్నీ తెలిసినట్లు అవుతుంది "అనేదానిని తండ్రి అయిన ఉద్దాలకుడు ఉపపాదించి చెప్పిన సందర్భంలో ఉండే "ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" అనే వాక్యంకూడా ఇక్కడ తప్పకుండా అనుసంధించదగినది.

మట్టి, కుండ, చట్టి మొదలైనవి ప్రత్యేక ప్రత్యేకంగా నామరూపాలను పొంది ఉన్నప్పుడు, పలు వస్తువులుగా ఉన్నందున “సర్వమ్” అని, ఈ నామరూపాలు లేకుండా ఉన్నపుడు “ఏకేన మృత్పిండేన” అని ఈ శ్రుతి వల్కుతున్నది. కావున, పైన పలికిన విషయం చక్కగా కష్టపడుతున్నది కదా. వీటివల్ల ఇక్కడ ఉండే “ఏకమ్” అనే శబ్దం నామరూపాలు లేకుండా ఉండే, సూక్ష్మదశను కలిగిన కారణవస్తువును తెలియజేస్తున్నది—అనే విషయాన్ని తెలుసుకున్నాము.

ఈ వాక్యంలో ఉండే “ఏవ” అనే పదం వైశేషికులు నిత్యం అని చెప్పే ఆకాశం మొదలైన వస్తువులు కూడా సంహరింపబడుతున్నాయి— అనే విషయాన్ని తెలియజేస్తున్నది. ఈ విధంగా ఏకశబ్దార్థాన్ని మనం మనసులో పెట్టుకొని, లోతుగా గమనించి చూస్తే, సృష్టికి ముందు బ్రహ్మం నామరూపాలు లేకుండా ఉండే సూక్ష్మ ప్రపంచంతో కూడి ఉన్నది— అనే విషయం అందరికీ చక్కగా బోధపడుతుంది.

ఇంతే కాక, జీవుడు నిత్యుడు అనేది వైదికులు అందరూ ముఖ్యంగా అంగీకరించే ఒక విషయం. దీనివల్ల సృష్టికి ముందు కూడా జీవుడు ఉన్నాడు— అనేది స్పష్టపడుతున్నది. జీవుడు జ్ఞానం కలిగినవాడు. బ్రహ్మం కూడా జ్ఞానం కలిగినది. అందుచేత ఈ పరమాత్మ జీవునితో పోలి ఉన్నాడు. ఇందువల్ల బ్రహ్మంతో పోలి ఉండే వస్తువు ఒకటి ఉన్నది— అనే విషయాన్ని కూడా మనం చక్కగా తెలియవచ్చు.

ఇంతేకాక, వ్యాసులు శారీరకమీమాంసలో “జీవాత్మలు ఎల్లప్పుడూ ఉన్నారు. ప్రళయకాలంలో వారికి, వారి కర్మలకు నాశం లేదు. భగవంతుడు మొదట సృష్టించేటప్పుడు, వారి వారి కర్మలను అనుసరించే విచిత్ర సృష్టిని చేస్తున్నాడు. కనుక, అతనికి వైషమ్యం మొదలైన దోషాలు చెప్పడానికి అవకాశం లేదు”— అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేశారు. “వైషమ్యనైర్ఘృణ్యే, న”, “న కర్మవిపాకాదితి చేన్న” అనే బ్రహ్మసూత్రాలను గమనించాలి. దీనివల్ల కూడా పైన తెలిపిన విషయం, అంటే, బ్రహ్మతో పోలిన వస్తువులు ఉన్నాయి— అనే విషయం స్పష్టపడుతుంది.

ఇంక, "అద్వితీయమ్" అనే పదంలోని అర్థాన్ని చూద్దాం. ఈ పదం కుండడకు కుమ్మరివానివలె, ఈ ప్రపంచానికి బ్రహ్మమే నిమిత్తకారణం, ఇంకొకటి నిమిత్తకారణం కాదు— అనే అభిప్రాయాన్ని తెలుపుతున్నది. ఏ విధంగా? అంటే, ఏకశబ్దంలోని అర్థాన్ని గమనించి చూసినప్పుడు, కుండ, చట్టి మొదలైన అనేక కార్యవస్తువులకు మట్టిముద్ద కారణం అయినట్లుగానే, ఈ ప్రపంచానికి —నామరూపాలు లేకుండా ఉండే సూక్ష్మప్రపంచంతో కూడిన బ్రహ్మం కారణం అవుతున్నది— అనే విషయాన్ని ఒక విధంగా గుర్తించాము కదా. ఈ విషయాన్ని తెలుసుకున్నవారికి "ఈ ప్రపంచానికి నిమిత్తకారణమైన వస్తువు ఏది? "అనే సందేహం కలగడం సహజమే. ఈ సందేహం తీరేటట్లు ఈ అద్వితీయపదానికి "భగవంతుడు విచిత్రశక్తిని కలిగినవాడు కనుక, ఉపాదానం అయిన అతడే నిమిత్తకారణం, ఇంకొకటి కాదు"— అనే అభిప్రాయాన్ని గ్రహించడం చాలాయుక్తమైనది కదా.

ఇక, "సదేవ" అనే పదంలోని అర్థాన్ని గమనించి చూద్దాం. ఇక్కడ "సదేవ" అనేది అసత్కార్యవాదాన్ని నిరాకరిస్తున్నది— అని అంటారు. దీనిని వివరిస్తాను.

కుమ్మరివాడు మట్టిని, జలాన్ని కలిపి ముద్ద చేసి, కుండగా చేయడాన్ని మనం చూస్తున్నాము. ఇక్కడ కుండ అనేది కార్యం, మట్టి కారణం. కార్య వస్తువు అయిన కుండ నోరు, కడుపు కలిగిన ఆకారాన్ని కల మట్టి తప్ప వేరు పదార్థం కాదు. ఈ కార్యవస్తువు తాను పుట్టడానికి ముందు తన నోరు, కడుపు లేకుండా ఉన్నప్పటికీ, పిండదశతో ఉండే వస్తువే —అనే విషయాలు మనకు తెలిసినవే. ఇందువల్ల ఒక దశలో ముందు ఉండే వస్తువే తరువాత పుడుతున్నది, వేరొక దశను పొందుతున్నది, ముందు లేనిది తరువాత పుట్టదు— అనేది చక్కగా స్పష్ట పడుతున్నది కదా.

దీనిని మనం మనసులో పెట్టుకొని "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అనే వాక్యాన్ని గమనించి చూస్తే, వాస్తవమైన అర్థం చక్కగా బోధపడుతుంది. సృష్టికి ముందు ఈ ప్రపంచం "సత్" అనే వస్తువుగానే ఉన్నది— అనేది దీని అర్థం. ఈ అర్థాన్ని

గమనించినప్పుడు, ముందు లేనిది తరువాత పుడుతున్నది — అనే అసత్కార్యవాదానికి ఏ మాత్రం అవకాశం లేదు— అనేది అందరికీ చక్కగా బోధపడుతుంది.

ఇక్కడ "సత్" అనే పదం ప్రమాణసంబంధానికి యోగ్యతను కలిగిన వస్తువును నిర్దేశిస్తుంది. అర్థంలోని యుక్తతను గమనిస్తే, కారణత్వానికి అవశ్యం అపేక్షితమైన జ్ఞానం, శక్తి మొదలైన గుణాలను కలిగిన బ్రహ్మాన్ని నిర్దేశిస్తుంది— అనేది స్పష్టపడుతుంది. కుమ్మరివాడు మట్టిని కుండగా చేయడానికి తగిన జ్ఞాన, శక్తులను కలిగినవాడుగా ఉన్నాడు కదా. ఆ కుమ్మరివాని వలె, పరమాత్మకూడా, ప్రపంచాన్ని సృష్టించేటప్పుడు దానికి కావలసిన జ్ఞాన శక్తులను కలిగి ఉండాలి" అనేది చెప్పకుండానే స్పష్టపడుతుంది కదా.

"సదేవ" అనే మొదటి వాక్యంలోని అర్థాన్ని ఇంతవరకు కొంచెం వివరంగా గమనించాము, సంగ్రహంగా చెబితే, "ఓ సౌమ్యుడా! ఈ ప్రపంచం, సృష్టికాలానికి ముందు సత్ అనే వస్తువుగానే ఉన్నది. నామరూపాలు లేకుండా ఉండే సూక్ష్మదశను కలిగిన వస్తువుగానే ఉన్నది. ఈ ప్రపంచానికి ఆ వస్తువే నిమిత్త కారణం, ఇంకొకటి నిమిత్తం కాదు— అని చెప్పవచ్చు. ఇక్కడ "సత్" అని చెప్పబడే వస్తువు బ్రహ్మం. అది చాలా ఉన్నతమైన వస్తువు. జ్ఞానం, శక్తి మొదలైన గుణాలతో కూడినది. దానితో పోలిన వస్తువులు ఉన్నాయి. దానికంటే విలక్షణమైన వస్తువులు కూడా ఉన్నాయి. ఈ విధంగా ఆ వస్తువు విశిష్టంగానే, అంటే, గుణాలతోనూ, చేతనాచేతనవస్తువులతోనూ కూడినదిగానే ఉన్నది— అనే విషయాన్ని మనం సారంగా గ్రహించవచ్చు.

ఇక, "తత్త్వమసి" అనే చివరి వాక్యాన్ని గమనిద్దాం. ఈ వాక్యంలో "తత్" అనే పదం జ్ఞానం, శక్తి మొదలైన గుణాలతో కూడిన బ్రహ్మాన్ని, "త్వం "అనే పదం శ్వేతకేతువును శరీరంగా కలిగి ఉండే పరమాత్మను, ప్రథమావిభక్తి ఈ రెండు వస్తువులను కలిగిన ఐక్యాన్ని చెబుతున్నవి. ఈ విధంగా ఈ రెండు శబ్దాలు ఒక వస్తువులో ఉన్నందున దీనిని సామానాధికరణ్యం అని అంటారు.

"భిన్నప్రవృత్తినిమిత్తనాం శబ్దానా మేకస్మిన్ అర్థే వృత్తిః సామానాధికరణ్యమ్", అనే లక్షణవాక్యాన్ని గమనించవచ్చు.

"శుక్లా శోభనాక్షీ పూర్ణ శృంగా గౌః, తా మానయ" అనే వాక్యాన్ని ఉదాహరణంగా గ్రహిద్దాం. ఈ వాక్యంలో ఉండే "తామ్" అనే తత్పదం ముందు భాగంలో చెప్పబడిన తెల్లని రంగును, అందమైన కన్నులను, నిండు కొమ్ములను కలిగిన గోవునే నిర్దేశిస్తుంది— అనే విషయాన్ని మనం చూస్తున్నాము కదా.

ఆ విధంగానే, ఇక్కడ కూడా తత్పదానికి ముందు బ్రహ్మానికే తగిన పలు గొప్ప అతిశయాలను తెలిపే పలు వాక్యాలను మనం గమనించవచ్చు. విస్తృతికి భయపడి కొన్ని వాక్యాలను మాత్రం ఇక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అనే మొదటి వాక్యంలోనే ముందు చెప్పినట్లుగా, బ్రహ్మానికి జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు, ఆ బ్రహ్మంతో పోలని వస్తువులు ఉన్నాయి— అనే విషయాన్ని, ఆ బ్రహ్మమే ఈ ప్రపంచానికి, కుండకు మన్ను, కుమ్మరివాడువలె ఉపాదాన కారణం, నిమిత్తకారణం కూడా— అనే విషయాన్ని గమనించాము కదా.

ఇంతేకాక, ఈ "తత్వమసి" అనే వాక్యంతో చేరిన "ఐతదాత్మ్యమిదం సర్వం, తత్ సత్యం, స ఆత్మా" అనే వాక్యం కూడా ఇక్కడ తప్పక గమనించదగినది. ఈ వాక్యం "ఈ ప్రపంచం బ్రహ్మాన్ని ఆత్మగా కలిగినది, అది సత్యం, బ్రహ్మం ఆత్మ" అనే అర్థాలను తెలుపుతున్నది వీటిని మనం మనస్సులో పెట్టుకొని లోతుగా గమనించి చూస్తే, బ్రహ్మం ఈ ప్రపంచానికి ఉపాదానకారణంగా, నిమిత్తకారణంగా ఉన్నది. జ్ఞానం, శక్తి మొదలైన కళ్యాణ గుణాలను కలిగినది. అన్ని వస్తువులను ఏ స్థితిలో అయినా ధరించి, అవి చేసే పనిని స్వీకరించి, ఆనందించే చేతనపదార్థంగా ఉన్నది" అనేవి చక్కగా వ్యక్తమవుతున్నాయి కదా. వీటి వల్ల ఇక్కడ ఉండే తత్పదం జ్ఞానం, శక్తి మొదలైన గుణాలతో కూడిన, కారణమైన బ్రహ్మాన్ని తెలుపుతున్నది— అని గ్రహించడం చాలా యుక్తమైన విషయం అవుతుంది. ఇక్కడ ఉండే "త్వం" అనే పదం— శరీరాన్ని నిర్దేశించే

పదం శరీరి పర్యంతంగా వెళుతుంది —అనే క్రమంలో, శ్వేతకేతువును శరీరంగా కలిగిన పరమాత్మవరకు బోధిస్తుంది. దేవదత్తుడు అనే పదం దేవదత్తుని శరీరాన్ని తెలిపి, ఆ శరీరపర్యంతంలో నిలువకుండా, దానిని ధరించి, నియమించి, అది చేసే పనిని స్వీకరించి ఆనందించే జీవుని వరకు నిర్దేశించడాన్ని మనం చూస్తున్నాము కదా. జీవుడు పరమాత్మకు శరీరం అనేది ""ఐతదాత్మ్యమ్ ఇదం సర్వమ్" అనే ఈ భాగంలో ఉండే వాక్యం వల్ల, "యస్యాత్మా శరీరమ్"అనే ఇంకొక శ్రుతి వాక్యం వల్ల మనం చక్కగా తెలుసుకున్నదే. ఈ విధంగా "తత్, త్వమ్" అనే రెండు పదాలు భగవంతుడు అనే ఒక వస్తువులో ఉండడాన్ని బట్టి ఇక్కడ సామానాధికరణ్యాన్ని మన పెద్దలు నిర్వహించారు.

ఇంతవరకు చెప్పినదానినిబట్టి ఛాందోగ్యంలోని సద్విద్యా ప్రకరణంలో(సత్ అని బ్రహ్మాన్ని తెలిపి, ఉపదేశం చేసే ప్రకరణంలో) బ్రహ్మం మిగిలిన చేతనాచేతనవస్తువులతో, కల్యాణగుణాలతో కూడినదిగానే, అంటే, విశిష్టంగానే ఉన్నది— అనే విషయం, బ్రహ్మం, ప్రపంచం— అనే వీటికి శరీరాత్మభావం అనే సంబంధం ఉన్నది— అనే విషయం సంగ్రహంగా చూచాము. గుణాలతోనూ, చేతనాచేతనాలతోనూ కూడిన పరమాత్మే నారాయణుడు కనుక, అతడే ఉన్నతమైన తత్వం అనేది కూడా ఇక్కడ తెలియబడుతున్న విషయం. ఈ నారాయణుడే "ఉత్తమః పురుషః" అని, "పరంజ్యోతిః" అని చెప్పబడుతున్నాడు. ఈ పరమాత్మను, జీవుడు, ఈ పరమాత్మ అనుగ్రహంచేత దరి చేరి, తన దాస్యస్వభావానికి తగినట్లుగా అనుభవ కైంకర్యాలను చేసి, తరిస్తున్నాడు. ఈ ఉజ్జీవనమే మోక్షం— అని ఈ ఉపనిషత్తు ఇంకొక భాగంలో చెప్పింది. "ఏష సంప్రసాదః అస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే, స ఉత్తమః పురుషః, స తత్ర పర్యేతి" అనే వాక్యాన్ని గమనించవచ్చు. ఈ విధంగా ఛాందోగ్యంలోని అర్థాన్ని సంగ్రహంగా వివరించడం జరిగింది.



## శ్రీవైకుంఠస్తవంలో ఆళ్వార్ సూక్తుల భావం

తిరువాయ్ మొழி ప్రబంధంలో నమ్మాళ్వారులు (1–2–10) "ఎణ్ పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల వణ్ పుగழ் నారణన్ తిణ్ కழల్ శేరే" (లెక్కలేనన్ని, జ్ఞానాదిగుణాలను కలిగిన నిత్యమైన, స్వయం ప్రకాశకమైన ఆత్మలను, నిత్యసిద్ధకళ్యాణగుణాలను కలిగిన నారాయణుని, భక్తులను ఏ నాడు విడవకుండా రక్షించే స్వభావాన్ని కలిగిన శ్రీచరణాలను ఆశ్రయించు) అని అన్నారు.

ఈ ప్రయోగంలో "ఈఱిల" అనే ఒక విశేషణం ఉన్నది. "ఈఱు" అంటే నాశం— అని అర్థం. "ఇల" అంటే – నాశం లేనిది— అని అర్థం. అందుచేత, "ఈఱిల" అనే పదానికి "నాశం లేనిది, అంటే, నిత్యమైనది" అని అర్థం. ఈ విశేషణం, ఈ ప్రయోగంలో మధ్యలో ఉన్నది. అందుచేత, ఈ విశేషణాన్ని మధ్యమణిన్యాయంలో ముందు వెనుకలలో అన్వయించి అర్థం చెప్పే అవకాశం ఉన్నది. అంటే, "నాశం లేకపోవడం" అనే విశేషణాన్ని "ఒణ్ పొరుళ్" (విలక్షణమైన వస్తువు) అనే పదంతోను, "వణ్ పుగழ்" (కళ్యాణగుణాలు) అనే పదంతోను అన్వయించి, అర్థాన్ని చెప్పవచ్చు. ఆ విధంగా ముందు వెనుకలలో అన్వయించి అర్థాన్ని చెప్పినప్పుడు, పరమాత్మ లెక్కలేనన్ని, నిత్యమైన, జ్ఞానాదిగుణాలను కలవాడు—అని, నిత్యమైన కళ్యాణగుణాలను కలవాడు – అని అర్థం వస్తుంది.

ఆంధ్రభాషాసంప్రదాయానుసారంగా విశేషణపదాలు విశేష్యపదానికి నియతంగా ముందుగా ఉండాలనే నియమం ఉన్నట్లు, ద్రావిడభాషలో ఆ నియమం లేదు. విశేషణపదాలు విశేష్యానికి తరువాత ఉన్నప్పటికీ, అర్థస్వారస్యాన్ని బట్టి అన్వయించుకునే సంప్రదాయం సంస్కృత భాషలో ఉన్నట్లుగా, ద్రావిడభాషలోకూడా ఉన్నది. అందువల్ల "ఈఱిల" అనే విశేషణపదం ఆత్మలను నిర్దేశించే "ఒణ్ పొరుళ్"

అనే విశేష్యపదానికి తరువాత ఉన్నప్పటికీ, దానిని మూడే ఆ విశేష్యపదంతో అన్వయించి అర్థం చెప్పే అవకాశం ఉన్నది.

ఆ విధంగా ", ఈఱిల" అనే పదాన్ని ముందు వెనుకలలో అన్వయించి అర్థాన్ని గ్రహించినప్పుడు, "ఈఱిల ఒణ్ పొరుళ్"(నాశం లేని, నిత్యమైన స్వయంప్రకాశకమైన ఆత్మవర్గం) అని, "ఈఱిల వణ్ పుగழ்"(నాశం, లేని నిత్యమైన కళ్యాణగుణాలు) అని అర్థం వస్తుంది. అప్పుడు "ఎణ్ పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల వణ్ పుగழ் నారణన్" అనే ప్రయోగానికి— "అసంఖ్యాకమైన, స్వయంప్రకాశకమైన, ఆత్మలను, నిత్యమైన కళ్యాణగుణాలను కలవాడు, నారాయణుడు" అనే అర్థం వస్తుంది.

ఈ విధంగా ఆళ్వారులు "నిత్యమైన ఆత్మవర్గాన్ని, నిత్యమైన కళ్యాణగుణాలను కలిగినవాడు నారాయణుడు" అని సమభివ్యాహరం చేసి చెప్పినందువల్ల ఒక విలక్షణమైన తత్త్వం స్ఫురిస్తున్నదని మన పూర్వాచార్యులు అభిప్రాయపడ్డారు. అది ఏమిటో, కొంచెం గమనించి చూద్దాం.

"ఆత్మస్వరూపం నిత్యం" అని అన్నప్పుడు, నిత్యవస్తువులన్నీ సామాన్యంగా స్వతంత్రమై లోకంలో కనిపిస్తున్నందున ఆత్మలు స్వతంతమా? అనే సందేహం కలుగుతుంది. ఈ సందేహాన్ని "ఈఱిల వణ్ పుగழ்" అనే ప్రయోగం తీరుస్తున్నది. భగవంతుని కళ్యాణగుణాలు భగవంతుని ఆశ్రయించుకుని ఉంటాయి. అయినప్పటికీ, అవి నిత్యాలు. ఏ విధంగా, భగవంతుని కళ్యాణగుణాలు నిత్యాలు అయినప్పటికీ, భగవంతుని ఆశ్రయించుకునే ఉన్నందున, అవి పరతంత్రాలో, ఆ విధంగానే, ఆత్మలు కూడా నిత్యాలు అయినప్పటికీ, భగవంతుని ఆశ్రయించుకునే ఉన్నందున అవి పరతంత్రాలు— అనే ఒక విలక్షణమైన అర్థం ఆత్మలను, కళ్యాణగుణాలను సమభివ్యాహారం చేసి చెప్పినందువల్ల ఏర్పడుతున్నది. "తన్నుడైయ కళ్యాణగుణంగళోపాది నిత్యముమాయ్, ప్రకారముమా యిరుక్కుమ్ ఇవ్వస్తు ఎన్నైక్కాగ

గుణజ్గళై నిదర్శనమాగ చ్చొల్లుగిఱదు" (భగవంతుని కళ్యాణగుణాలవలె ఈ ఆత్మవర్గంకూడా నిత్యమై, ప్రకారమై ఉంటుంది— అని చెప్పడంకోసంగా ఆళ్వార్లు కళ్యాణగుణాలను ఉదాహరణంగా చెప్పారు) అని నంబిళ్ళై తమ ఈడు వ్యాఖ్యానంలో ఈ ప్రయోగాన్ని వివరిస్తూ అన్నారు.

ఇటువంటి సందర్భాన్నే మనం శ్రీవైకుంఠస్తవంలోని "ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా, నిత్యం ప్రియా స్తవ తు కేచన తే ఽ పి నిత్యాః, నిత్యం త్వదేకపరతంత్రనిజస్వరూపాః, భావత్కమంగళ గుణా హి నిదర్శనం నః" (స్వామీ! నీ సంకల్పంవల్లనే సమస్త పదార్థాల సత్త ఏర్పడుతున్నది. నీకు ఏ కొందరు నిత్యం ప్రియులో., వారు నిత్యులు అవుతున్నారు. ఆ విధంగా వారు నిత్యులు అయినప్పటికీ, నీ అధీనంలో ఉండే తమ స్వరూపాన్ని కలిగినవారై ఉన్నారు. ఇక్కడ నిదర్శనం ఏమంటే, నీ కళ్యాణగుణాలే) అనే శ్లోకంలో మనం గమనించవచ్చు. ఈ శ్లోకంలో నిత్యులైన నిత్యసూరుల భగవత్పరతంత్రతను కూరేశులు భగవంతునకు పరతంత్రమై ఉండే కల్యాణగుణాలను ఉదాహరణంగా చూపి సమర్థించారు.

ఈ విధంగా కూరేశులు పలకడానికి పైన చూపిన నమ్మాళ్వారుల ప్రయోగమే మూలం— అనే విషయం తెలియజేస్తూ నమ్మాళ్వారుల పై ప్రయోగాన్ని ఈడువ్యాఖ్యానంలో వివరించేటప్పుడు నంబిళ్ళై కూరేశులు అనుగ్రహించిన ఈ శ్లోకాన్ని ప్రమాణంగా ఉదాహరించారు.

ఈ విధంగా ఆళ్వారుల దివ్యసూక్తుల ప్రభావం కూరేశుల శ్రీవైకుంఠస్తవంలోని పలు శ్లోకాలలో చాలా అద్భుతంగా గోచరిస్తుంది. ఇది కేవలం ఒక ఉదాహరణం మాత్రమే.

★★★

# శ్రీవ్యాసమునులు – శ్రీమన్నాథమునులు

**"నమో ఽ చింత్యాద్భుతాక్లిష్ట జ్ఞానవైరాగ్యరాశయే,**

**నాథాయ మనయే ఽ గాధభగవద్భక్తి సింధవే. "**

ఈ సంవత్సరం శ్రీమన్నాథమునుల అవతరించి 1200 సంవత్సరాలు పూర్తి అయిన శుభసందర్భం. దేశంలో అంతట వారికి సంబంధించిన ఉత్సవాలు చాలా ఉత్సాహంతో జరుపబడుతున్నాయి.

ఈ లోకంలో ఉండే ప్రతి ఒక్కడు ఒక సదాచార్యుని ఆశ్రయించి, జ్ఞానాన్ని పొందాలి. ఆ విధంగా జ్ఞానాన్ని పొందిన తరువాత, అతడు తనకు జ్ఞానాన్ని ప్రసాదించిన ఆ సదాచార్యుని వైభవాన్ని లోకంలో అంతటా వ్యాపింప చేయాలి. అంతటా అతని మహిమ అందరికీ తెలిసేటట్లు చేయాలి– అని శాస్త్రాలు మనకు తెలుపుతున్నాయి. ", ఆచార్యవాన్ పురుషో వేద" –ఈ లోకంలో ఉండే అందరూ ఆచార్యుని కలిగి ఉండాలి. "గురుం ప్రకాశయేత్ ధీమాన్" బుద్ధిమంతుడైనవాడు తన ఆచార్యుని గొప్పతనాన్ని అంతటా ప్రకాశింప చేయాలి, అందరూ తెలుసుకునేటట్లుగా ఆచార్యను గొప్పతనాన్ని గూర్చి ప్రచారం చేయాలి. 8 దిక్కులలోను ఆచార్య వైభవాన్ని వ్యక్తం చేయాలి–అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. అటువంటి గొప్పతనం సదాచార్యులకు ఉన్నది. ఆచార్య వైభవాన్ని మనం ప్రతి దినం మనసులో భావించి, ఆచార్యునకు శుభం కలగాలని మంగళాన్ని ఆశాసించాలి.

శ్రీ నాథమునుల తిరునక్షత్ర మహోత్సవాలు అంతట మహోత్సహంగా జరిగే ఈ సమయంలో ఆ ఆచార్యవర్యుల వైభవాన్ని మనం కొంచెం తెలుసుకోవడానికి ప్రయత్నం చేద్దాం. ఈ ప్రయత్నంలో భాగంగా నాథమనులకు వ్యాసమహామునితో ఉండే పోలికలను గమనించి, తెలుసుకొందాం.

మన సంప్రదాయంలో చాలా మందికి ముని అనే పేరు ప్రసిద్ధంగా ఉన్నది. వారిలో వ్యాసమహర్షి ఒకరు. వ్యాసమహర్షిని ఉద్దేశించి పలికేటప్పుడు "నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః" అనే సూక్తి ప్రసిద్ధమైనది. వ్యాసుడు బ్రహ్మ నిధి. అంటే, బ్రహ్మజ్ఞానానికి నిధివంటివాడు ఉన్నతమైన బ్రహ్మజ్ఞానానికి అద్వితీయమైన ఆశ్రయం అతడు. మనం వ్యాసపీఠం అని వ్యవహరిస్తున్నాము. శాస్త్రాల, పురాణాల, వేదాల శ్రీకోశాలను ఆ వ్యాసపీఠంలో పెట్టి ఆరాధించి అధ్యయనం చేస్తాము. దీనిని వ్యాసపీఠం అని ఎందుకు అంటున్నాము? అంటే, వ్యాసుని మూలంగా కదా మనకు ఇన్ని గ్రంథాలు, ఇంత జ్ఞానం లభిస్తున్నది అందువల్ల ఆ మహర్షి స్మృతిగా వారి విషయంలో కృతజ్ఞతా స్మరణగా గ్రంథాలను పెట్టే పూజించే పీఠానికి వ్యాసపీఠం అని మనం పేరు పెట్టి వ్యవహరిస్తున్నాము. ఈ విధంగా జ్ఞానానికి అంతటికి నిధివంటివారు కనుక, బ్రహ్మ నిధి అని ఆ మహర్షి కీర్తింపబడుతున్నారు.

ఈ విధంగానే, నాథముని కూడా అంతు లేని జ్ఞానానికి నిధి. శ్రీయామునులు స్తోత్ర రత్నంలో మూడు శ్లోకాలతో నాథమునులను కీర్తించారు. వారి జ్ఞానవైభవాన్ని ప్రస్తుతించారు. "నమో ऽ చింత్యాద్భుతాక్లిష్ట జ్ఞానవైరాగ్యరాశయే, నాథాయ మనయే ऽ గాధభగవద్భక్తి సింధవే." అనేది ఆ శ్లోకాలలో ఒకటి. ఇంతటిది అని ఊహించడానికి సాధ్యం కానిది, ఆశ్చర్యకరమైనవి, అక్లిష్టమైనవి, అంటే, ఎటువంటి శ్రమ లేకుండా సంపాదింపబడినవి అయిన జ్ఞానం, వైరాగ్యం అనే వీటికి సాటి లేని నిధివంటివారు, నాథమునులు– అని ఇక్కడ శ్రీయామునులు అంటున్నారు. "అచింత్యమ్"– ఊహించడానికి సాధ్యం కానంతగా విస్తరించినది నాథమునుల జ్ఞానం. ఆ విధంగానే అది అద్భుతమైనది. ఆ జ్ఞానంలోని చాలా అల్పమైన భాగాన్ని మనం అనుభవించినప్పటికీ కూడా, ఇంత అని చెప్పడానికి సాధ్యంకానంత ఆనందం మనకు కలుగుతుంది. అందువల్ల అది అద్భుతమైనది, ఆ విధంగానే, నాథమునుల జ్ఞానం అక్లిష్టమైనది, అంటే, ఎటువంటి శ్రమ, దుఃఖం లేకుండా పొందబడినది.

ఈ లోకంలోఎవరైనా, జ్ఞానాన్ని సంపాదించాలి అంటే, ఎంతో శ్రమపడితే గాని సాధ్యం కాదు కదా. మహర్షులు అందరూ కూడా తమ జ్ఞానాన్ని ఎంత శ్రమపడి సంపాదించారు. నీటిలోనూ, అగ్నిలోనూ నిలబడి, ఒంటికాలి మీద నిలచి, ఎంతో కాలం శ్రమపడి తపస్సు చేసి సంపాదించిన జ్ఞానం కదా, వారి జ్ఞానం. ఆ విధంగా ఉన్నప్పుడు, నాథమునుల జ్ఞానం అక్లిష్టమైనది, అంటే, ఎటువంటి శ్రమ లేకుండా సంపాదింపబడినది—అని విధంగా యామునులు అంటున్నారు? నమ్మాళ్వారులను గూర్చి వారు ఎంతో కాలం శ్రమపడి జ్ఞానాన్ని సంపాదించారని మనం వారి చరిత్రలో వింటున్నాము కదా. 1200 మార్లు కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని అనుసంధానం చేసి, నాథమునులు, ఆళ్వారుల వలన జ్ఞానాన్ని సంపాదించారు అని వింటున్నాముకదా. అటువంటప్పుడు నాథమునుల జ్ఞానం అక్లిష్టం అని అనడం ఏమి!" అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు.

అయితే, నాథమునులు ఈ విధంగా కష్టపడి జ్ఞానాన్ని సంపాదించారు—అని చెప్పడానికి మనం ఎవరం? ఆళ్వారులను గూర్చి ధ్యానం చేసినప్పుడు కానీ, కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని అనుసంధానం చేసినప్పుడు కానీ, వారు ఆ కార్యాలను ఎంతో ఆనందంతోనే చేశారు. ప్రీతి పూర్వకంగానే చేశారు. ", అళ్వార్లను గూర్చి ధ్యానించాలి, వారిని గూర్చిన దివ్య ప్రబంధాన్ని ఆనందంగా ప్రీతితో మననం చేయాలి" అనే అభిప్రాయంతోనే కారు ప్రయత్నించారు కనుక, వారి ఆ ప్రయత్నం ఆనందమయంగానే ఉన్నది. ఆ ప్రయత్నంలో వారికి ఎంత మాత్రం శ్రమ కలుగలేదు. అందుచేత వారు సంపాదించిన జ్ఞానం అక్లిష్టమైనది అని అనడంలో ఏ అడ్డు లేదు.

ఈ విధంగా వ్యాసముని బ్రహ్మ నిధి అయినట్లే, నాథమునులు కూడా బ్రహ్మ నిధియే—అని అనడంలో ఏ సందేహం లేదు. ఇది ఒక విధమైన పోలిక. ఇప్పుడు ఈ ఇద్దరి మధ్య ఉండే ఇంకొక పోలికను గమనిద్దాం.

వ్యాసమునిని నిర్దేశించేటప్పుడు వ్యాసాచార్యులు అని మనం అంటున్నాము. వ్యాసులకు ముందు ఉండే మహర్షులకు ప్రసిద్ధంగా గురువు అనే నామమే ఉన్నది. ఈ ఆచార్య పదం వ్యాసునినుండే ప్రసిద్ధంగా ప్రయోగింపబడుతున్నది. ఇదే విధంగా, శ్రీవైష్ణవాచార్యపరంపరలో మొట్టమొదటివారు నాథమునులు. వేదాంతదేశికులు కూడా "నాథోపజ్ఞం ప్రవృత్తమ్", అని శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన ఆచార్యపరంపర నాథమునులతో ఆరంభమైనదని అన్నారు. లక్ష్మీనాథునకు, లక్ష్మీదేవికి, విష్వక్సేనులకు, నమ్మాళ్వారులకు ఆచార్య పరంపరలో అన్వయం ఉన్నప్పటికీ, వారికి కల ఆచార్యత్వం అనేది అధికంగా వచ్చినదే. అంటే, భగవంతునకు లోకానికి అంతటికి ఈ స్వామియై ఉండడం అనేది ప్రధానమైన స్వభావం. లక్ష్మీదేవికి ప్రధానమహిషి ఉండడం అనేది ప్రధానమైన స్వభావం. విష్వక్సేనులు నిత్యసూరులు భగవంతునకు కైంకర్యం చేసే పరివారంలో ఒకరు. ఇక, నమ్మాల్వార్లకు ఆళ్వారుల పరంపరలోనే ప్రసిద్ధమైన అన్వయం అందుచేత ఈ నలుగురకు గల ఆచార్యత్వం అధికమైన స్వభావమే తప్ప, కేవలమైన ఆచార్యత్వం అనేది వీరిలో లేదు. కాని, నాథమునులలో ఆచార్యత్వమే ప్రధానమైనది. "తమకు నమ్మాళ్వారుల వలన లభించిన అర్థాలు అన్నిటిని తరువాతివారికి అందజేయాలి" అనే ఆశయమే వారికి ప్రధానమైనది. అందుచేత, ఆచార్యపరంపరలో మొదటివారు వారే అని ఈ ఆచార్య పదం అనేది నాథమునులనుండి ప్రసిద్ధంగా వ్యవహరింపబడుతున్నది అని భావించవచ్చు.

ఇప్పుడు ఇంకొక సామ్యాన్ని గమనిద్దాం.

వ్యాసులను గూర్చి ప్రస్తావించేటప్పుడు వారి వంశసంబంధనిర్దేశపూర్వకంగానే చెప్పడం జరుగుతున్నది. వారి కులవైభవాన్ని చేర్చి వారిని అనుసంధించడం జరుగుతున్నది. "పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్" —పరాశరమహర్షి కుమారులు, శుకమహర్షికి తండ్రి —అని కదా వ్యాసులు నిర్దేశింపబడుతున్నారు. ఈ విధంగా, వ్యాసమహర్షికి వారి తండ్రి వలన కలిగిన

అతిశయం, వారి కుమారుల వలన కలిగిన అతిశయం, అనే ఈ రెండు కూడా అనుసంధింపబడుతున్నవి. వేదం కూడా వ్యాసుని గురించి నిర్దేశించేటప్పుడు, "స హోవాచ వ్యాసః పారాశర్యః" అని "పరాశరమహర్షి కుమారులైన వ్యాసులు చెప్పిన మాట ఇది "అని పరాశర మహర్షి సంబంధాన్ని పురస్కరించుకొని వ్యాస మునిని నిర్దేశించింది. పరాశరమహర్షి సంబంధాన్ని కలిగిన వ్యాసమహర్షి చెప్పినది చాలా ఆదరించదగినది, విశ్వసించదగినది, ఈ మహర్షి మాట పరమప్రమాణం అని అన్నది. ఒకరు చెప్పిన మాటను మనం నమ్మాలంటే, వారు మనకు విశ్వసనీయులుగా కదా ఉండాలి. ఆ విధంగా విశ్వసించదగినవారు వ్యాసమహర్షి. దానికి కారణం వారు పరాశర మహర్షి సంబంధాన్ని కలిగినవారు —అని వేదం అన్నది.

ఈ విధంగానే, నాథమునులను కూడా వారి ఆచార్య సంబంధ పురస్సరంగానే ప్రస్తావించడం జరుగుతున్నది. నాథముని అనే ఈ పదాన్ని కొంచెం విడదీసి గమనించి చూస్తే కూడా ఈ అర్థం మనకు బోధపడుతుంది. "వేదమ్ తమిழ் శెయ్ ద మెయ్యన్ ఎழில్ కురుగైనాదన్" అని చెప్పిన విధంగా వేదాన్ని ద్రావిడీకరించిన నాథులు నమ్మాళ్వారులు. ఆ నాథులను, అంటే, ఆళ్వార్లను ఎల్లప్పుడూ మనస్సులో నిలుపుకొని మననం చేసేవారు కనుక నాథమునులు అని చెప్పబడుతున్నారు— అనే నాథముని శబ్దవ్యుత్పత్తిని మనం గమనించినప్పుడు, నాథమునులకు ఆచార్యులైన నమ్మాళ్వారుల సంబంధపూర్వకంగానే కదా వారు తెలియబడుతున్నారు. ఈ విధంగా, నమ్మాళ్వారుల సంబంధపూర్వకంగానే వీరి నామం ప్రకాశిస్తున్నది. ఇంతేకాక, కూరేశులు వరదరాజస్తవంలో " రామానుజాంఘ్రి శరణోస్మి కులప్రదీపః త్వాసీత్ స యామునమునేః స చ నాథవంశ్యః వంశః పరాంకుశమునేః" అని అంటూ నాథములను గూర్చి నిర్దేశించేటప్పుడు వారు నమ్మాళ్వారులకు సంబంధించినవారు, పరాంకుశముని వంశానికి చెందినవారు, వారి శ్రీచరణస్థానీయులు — అని ఆచార్య సంబంధపూర్వకంగా తెలియజేశారు. అంతేకాక, ఇక్కడ కూరేశులు "శ్రీయామునులకు శ్రీ నాథమునులు

పితామహులు" అని అన్నారు. యామునులకు నాథమునులు తాత అని అంటే, అప్పుడు, తమ మనుమని వల్ల కూడా వారికి ఒక అతిశయం ప్రాప్తించినట్లు చెప్పినట్లే కదా. ఏ విధంగా కుమారుడైన శుక మహర్షి వల్ల వేద వ్యాసమహర్షికి అతిశయం కలిగిందో, ఆ విధంగానే, పౌత్రుడైన శ్రీయామునుల వలన నాథమునులకు ఒక అతిశయం కలిగింది—అని ఇక్కడ సూచింపబడింది. అందువల్ల, నాథమునులు పలికినది అంతా పరమ ప్రమాణమైనది చాలా నమ్మదగినది, వారు పరమాప్తులు—అని కూడా ఇక్కడ సూచింపబడింది. యోగదశలో నమ్మాళ్వారుల దర్శనాన్ని పొంది, వారి వలన దివ్యప్రబంధాలను ఉపదేశంగా పొంది, వాటిని మనకు ఉపదేశించారంటే, వారి సూక్తులు పరమప్రమాణాలు కదా. వారి ఆప్తత చాలా గొప్పది కదా.

అంతేకాక, వేదం వ్యాసుల విశ్వసనీయతను గూర్చి పలికేటప్పుడు, "స హోవాచ వ్యాసః పారాశర్యః" అని పరాశర మహర్షి సంబంధపూర్వకంగా తెలియజేసింది. "పరాశరమహర్షి సంబంధం కలిగిన వ్యాసమహర్షి పలికితే, అది అంతా వాస్తవమే అవుతుంది, నమ్మదగినది అవుతుంది" అని అన్నది. ఆ విధంగానే ఇక్కడ నాథమునులు పరాంకుశముని సంబంధాన్ని కలిగినవారు కనుక, వారు పలికినది అంతా ఆప్తిని కలిగి ఉంటుంది. వారు పరాశరులు, వీరు పరాంకుశులు. వైదికమైన తత్త్వాలకు విరుద్ధంగా పలికేవారు పరులు. అటువంటివారిని ఎదిరించి, ఓడించినవారు కనుక, ఆ ముని పరాశరులు అయ్యారు. ఆ విధంగానే, నమ్మాళ్వారులు కూడా భగవత్తత్త్వానికి వ్యతిరేకంగా వాదించేవారికి అంకుశంవంటివారు. వారి వాదాలను నిర్వీర్యం చేసే అర్థాలను కలిగిన పాశురాలను పాడి అణచివేసినవారు. కనుక పరాంకుశులు అయ్యారు. అందువల్ల పరాశరమహర్షి సంబంధం కలిగిన వ్యాసమహర్షి పలికినది అంతా ప్రమాణమని అంగీకరించినట్లుగానే, పరాంకుశముని సంబంధం కలిగిన నాథమునులు పలికినదానిని ప్రమాణంగా మనం గ్రహించడంలో అడ్డు ఏమున్నది? ఇటువంటి విధంగా ఈ ఇద్దరి మధ్య ఇంకొక సామ్యం ప్రకాశిస్తున్నది.

ఇప్పుడు వేరొక విధమైన సామ్యాన్ని వీరిద్దరి మధ్య గమనిద్దాం.

వేదవ్యాసమహర్షి సంకీర్ణంగా ఉండే వేదాలను అన్నిటినీ విభాగంచేసి అందించారు కనుక వ్యాసులు అనే పేరు వారికి వచ్చింది. పూర్వం వేదాలు అన్నీ కలిసే ఉండేవి. ఇది ఋగ్వేదం, ఇదియజుర్వేదం, ఇది సామవేదం అని ఏ విభాగం అప్పుడు లేదు. అందువల్ల వాటిని అధ్యయనం చేయడం చాలా కష్టంగా ఉండేది. విషయాన్ని గమనించిన వేదవ్యాసులు వేదవాఙ్మయాన్ని ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అని మూడు వేదాలుగా విభాగించి, అధ్యయన సౌకర్యం కలిగించారు. లోకంలో వేదానికి ప్రచారాన్ని కలిగించారు.

ఈ వేద విభాగంలో కూడా వేదవ్యాసమహర్షి ఒక విలక్షణమైన సూత్రాన్ని అనుసరించారు. వేదం అంతా "ఓంకార ప్రభవో వేదః" అనే విధంగా ప్రణవం నుండి ఉద్భవించినది ఈ ప్రణవం అకార ఉకార మకారాల రూపంలో ఉండే అక్షరాల కలయిక. అకారం నుండి ఋగ్వేదం పుట్టింది, యజుర్వేదం పుట్టింది, సామవేదం పుట్టింది కనుక, ఈ విషయాన్ని ఆధారంగా చేసుకుని, వేదవ్యాసులు వేదవిభాగాన్ని చేశారు.

ఇంతే కాక, గొప్ప ఇతిహాసమైన మహాభారతాన్ని రచించాదరు. ఎన్నో పురాణాలను అనుగ్రహించారు. ఈ విధంగా వేదాలను విభాగం చేసి, లోకంలో ప్రచారించేసిన గొప్పతనం, పలు పురాణాలను రచించి వాటిని లోకంలో ప్రవర్తింపజేసిన గొప్పతనం వేద వ్యాసులకు ఉన్నది.

ఆ విధంగానే నాథమునులు కూడా, నమ్మాళ్వారుల వలన తాము పొందిన దివ్యప్రబంధాలను ఒక క్రమ పద్ధతిలో విభాగించారు. నాలాయిర దివ్య ప్రబంధం అంతా ఒకటిగానే ఉన్నట్లయితే, ఆ దివ్య ప్రబంధాన్ని మనం అధ్యయనం చేయడం సాధ్యం కాదు కదా. ఈ క్లేశాన్ని గమనించిన నాథమునులు దివ్యప్రబంధ వాఙ్మయాన్ని చాలా అందంగా, ఒక నిర్దిష్టమైన క్రమంలో విభాగం చేసి మనకు అందించారు. ఆయా ప్రబంధాలకు తగిన నామాలను తిరుప్పల్లాండు, తిరుప్పావై, తిరుమాలై, తిరుచ్చంద

విరుత్తం ఇత్యాదిగా కూడా పెట్టారు. ప్రబంధాలను నాలుగు వేల రూపంలో విభాగం చేశారు. కొన్ని ప్రబంధాలను ముదలాయిరమ్ అనే మొదటి సహస్రంలోను, మరికొన్ని ప్రబంధాలను పెరియ తిరుమొ*ழி* అనే రెండవ సహస్రంలోను, ఇంకా కొన్ని ప్రబంధాలను ఇయఱ్పా అనే మూడవ సహస్రంలోనూ, తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని నాలుగవ సహస్రంలోనూ చేర్చారు. ఈ విధమైన మహో ోపకారాన్ని చేసినవారు శ్రీమన్నాథములు. సంస్కృత వేదాన్ని విభాగం చేసి సహాయపడిన ఉదారులు వేద వ్యాసులు. ద్రావిడ వేదం అనబడే దివ్య ప్రబంధాలను విభాగం చేసి ఉపకరించిన ఉదారులు శ్రీమన్నాథమునులు.

సంస్కృత వేదవిభాగంలో ఒక క్రమాన్ని వేద వ్యాసులు పాటించినట్లే, ఈ దివ్యప్రబంధాలను కూడా శ్రీమన్నాథమునులు ఒక క్రమాన్ని ఆధారంగా చేసుకుని విభాగాన్ని చేశారు. ద్రావిడ సాహిత్యం ఇయల్ తమి*ழ்*, ఇశైత్తమి*ழ்*, నాటక త్తమి*ழ்* అని మూడు విధాలుగా ఉంటుంది. ఈ విభాగాన్ని అనుసరించి నాథమునులు కూడా రాగయుక్తంగా గానం చేయదగిన పాశురాలను ఇశైవిభాగంలో చేర్చా రు. ఈ విభాగంలో ప్రథథమ, ద్వితీయ, చతుర్ధ సహస్రాలు చేరుతాయి. . మూడవ సహస్రం ఇయల్ విభాగంలోకి చేరుతుంది. నాటకత్తమి*ழ்* ఈ రెండిటిలో అంతర్భవించి ఉంటుంది. అందుచేత ప్రత్యేకంగా విభాగించలేదు.

ద్రావిడవేద విభాగంలో శ్రీమన్నాథమునులు ఇంకొక క్రమాన్ని కూడా అనుసరించారు. నమ్మాళ్వారుల వలన శ్రీమన్నాథములు ముందుగా తిరుమంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనే రహస్య త్రయాన్ని ఉపదేశంగా పొంది, ఆ తరువాత దివ్య ప్రబంధాన్ని గ్రహించారు. అప్పుడు నాథమునులు ఏమి గ్రహించారు? అంటే,, ఈ ద్రావిడ ప్రబంధాలు అన్ని ఈ రహస్యత్రయాల అర్థాన్ని ప్రతిపాదిస్తున్నాయి —అని. ఈ విషయాన్ని గ్రహించిన శ్రీమన్నాథమునులు ఈ ప్రబంధాల విభాగాన్ని రహస్యత్రయక్రమాన్ని అనుసరించి చేశారు. నాలుగువేల పాశురాలలో, మొదటి

సహస్రం, రెండవ సహస్రం —అనే ఈ రెండు విభాగాలలో ఉండే ప్రబంధాలు అష్టాక్షరి అనబడే తిరు మంత్రం యొక్క అర్థాన్ని తెలుపుతున్నాయని, మూడవ సహస్రం అయిన ఇయఱ్పా అనే విభాగంలో ఉండే ప్రబంధాలు చరమశ్లోకార్థాన్ని తెలుపుతున్నాయని, నాలుగవ సహస్రం అయిన తిరువాయ్ మొழி ద్వయమంత్రంలోని అర్థాన్ని తెలుపుతున్నాయని గ్రహించి, . దానికి అనుగుణంగా దివ్య ప్రబంధాల విభాగాన్ని చేశారు. తిరుప్పల్లాండు అనే ప్రబంధం ప్రణవంలోనే అర్థాన్ని తెలుపుతున్నది కనుక, దానిని మొదటి సహసం ఆరంభంలో చేర్చారు. వేదం ఆరంభం ఓంకారంతో ఆరంభం అయ్యేటట్లుగా, ద్రావిడ వేదాధ్యయనప్రారంభం కూడా ప్రణవార్థాన్ని నిరూపించే పల్లాండు ప్రబంధంతో ఆరంభం చేయాలని క్రమాన్ని ఏర్పాటు చేశారు. నమశ్శబ్దార్థాన్ని కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధం తెలుపుతున్నది కనుక, దానిని మొదటి సహస్రం చివరలో చేర్చారు. "నారాయణాయ, నమః" అనే రెండు పదాల అర్థాన్ని తెలియజేసే పెరియతిరుమొழி ప్రబంధాన్ని, తిరుక్కుఱుందాడగమ్, తిరునెడుందాండగమ్ అనే ప్రబంధాలను రెండవ సహస్రంలో చేర్చారు. ఈ క్రమంలోనే ఈనాటికీ ద్రావిడవేదాధ్యయనం జరుగుతున్నది.

సంస్కృత వేదాలు భగవంతుని వైభవాన్ని ప్రకటంగా తెలియజేస్తున్నవి —అని మనం చెప్పలేము. "త్రైగుణ్యవిషయా వేదాః" అనే విధంగా సత్వరజస్తమో గుణాత్మకులైన ఈ ప్రపంచం లోని అందరినీ దృష్టిలో పెట్టుకొని వేదాలు ప్రవర్తించాయి. అందువల్ల వాటిలో వేదాలలో ప్రతిపాదింపబడిన భగవద్వైభవం నిశితంగా గమనిస్తే, తప్ప సామాన్యులకు అంత సులభంగా అర్థం కాదు. ద్రావిడ వేదం, ఆ విధంగా కాకుండా, పరమ పురుషుడైన శ్రీమన్నారాయణుని వైభవాన్ని గూర్చి చాలా స్పష్టంగా, అందంగా, సులభంగా అందిస్తున్నది. భగవంతుని స్వరూపరూప గుణ విభూతిలీలలను గూర్చియే తప్ప, వేరొక విషయాన్ని ఈ ఆళ్వారుల ప్రబంధాలు ప్రస్తావించవు. చాలా సులభంగా మనం భగవద్వైభవాన్ని తెలుసుకోవడానికి ఇవి ఉపకరిస్తున్నాయి.

అటువంటి దివ్య ప్రబంధాలను నమ్మాళ్వారుల ద్వారా తాము పొంది, వాటిని చక్కగా విభాగం చేసి, మనకు అందించిన మహనీయులు, పరమాచార్యులైన శ్రీమన్నాథమునులు. ఇంకే కాక, ఈ ప్రబంధాలను దేవగాన ప్రక్రియలో గానం చేయదగిన క్రమాన్ని, దానిని అనుసరించి రాగతాళాలను నిర్దేశించి తెలియజేసినవారు వారే. ఇశైప్పా విభాగంలోని పాశురాలలోని అర్థాలకు అనుగుణంగా అభినయ క్రమాన్ని నిర్దేశించి తెలియజేసినవారు కూడా శ్రీమన్నాథమునులే. అటువంటి శ్రీమన్నాథమునుల వైభవం ఏమని పొగడగలం? వారి శ్రీచరణాలలో సాష్టాంగంగా ప్రణమిల్లి మన ఆర్ద్రమైన, హార్దమైన కృతజ్ఞతలను సమర్పించుకుందాం. స్వస్తి.

★★★